సంవత్సర చందా
రు. 12 0 0
విడిప్రతి 4 అ

# ఆంధ్రపత్రిక

సచిత్రవారపత్రిక

సంపుటము
సంచిక 31
1-4-53

**Founder K NAGESWARA RAO**

విజయ చైత్ర బహుళ విదియ బుధవారం




దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారి 15 వ వర్ధంతి-

**చైత్ర శుద్ధ పాడ్యమి ([illegible])**

# విషయానుక్రమణిక

ముఖచిత్రం : జయంతీవారి
"బంగారుభూమి"లో
అంజలీదేవి.



## రచయితలకు మనవి

మాకు కథలు, గేయాలు, చిత్రాలు, ఫొటోలు పంపేవారు వానిని తిప్పి పంపకోరినట్లయితే, రచనలూ చిత్రాలతోపాటు అవసరమైన స్టాంపులను గాని, స్టాంపులు అంటించి చిరునామా వ్రాసిన పెద్దకవర్లను గాని చేర్చి పంపవలసిందని మనవి. అలా పంపేవారికి మాత్రమే వారి రచనలను గాని, చిత్రాలను గాని ప్రచురించే ముందు ప్రచురణ విషయమై తెలియపరచగలము. ముందట స్టాంపులను చేర్చి పంపక, తరువాత ఉత్తరాలు వ్రాసి స్టాంపులు పంపినట్లయితే, వెతికి పంపడం కష్టమని రచయితలూ, చిత్రకారులూ గుర్తించ ప్రార్థన. ఈ సందర్భములో రచయితలు, చిత్రకారులు మాకు సహకార మివ్వగలరని ఆశిస్తున్నాము

"అంగన నమ్మరాదు తన యంకకు రాని
మహా బలాఢ్యు వే
భంగుల మాయలొడ్డి తెలుపం
దలపెట్టు;—వివేకియైన సా
రంగధరుం బదంబులు కరంబులు
గోయగజేసె దొల్లి చి
త్రాంగి, యనేకముల్ నుడువరాని
కుయుక్తులు పన్ని భాస్కరా!"

తా॥ భాస్కరా! తనవశమునకు రానటువంటి గొప్ప బలాఢ్యుడైన వానిని కూడా వేయి విధములుగా మాయలు పన్ని చెరచుటకు సంకల్పించును గనుక స్త్రీని నమ్మరాదు. పూర్వము చిత్రాంగి అనేకములైన చెప్పరాని కుయుక్తులను పన్నినటువంటిదై బుద్ధిమంతుడైన సారంగధరుని పాదములను చేతులను నరికించినది.

"అంగనను నమ్మరాదు" అన్న మాట ఎట్లా ఉన్నప్పటికీ, యీ చిత్రాంగి సారంగధరుల కథనే నమ్మరాదను సిద్ధాంత మొకటి ఉన్నది

రాజమహేంద్రవరంలో చాళుక్య వంశ రాజులు క్రీస్తుశకం 11 వ శతాబ్దములో అనగా సుమారు 900 ఏళ్ల క్రిందట పరిపాలించారు. ఆనాటి కాలంలో రాజరాజ నరేంద్రుడు అనే చక్రవర్తి తెనుగురాజ్యం పరిపాలించాడు. నిజమే. కాని, అతనికి సారంగధరుడనే కుమారుడు లేడు. రాజరాజనరేంద్రునకు రత్నాంగి, చిత్రాంగి అనే పేరుగల భార్యలు ఇద్దరు లేరు. ఈ చిత్రాంగి కథ మన తెనుగురాజ్యం పరిపాలించినటువంటిన్నీ, నన్నయ్యభట్టు చేత ఆంధ్రమహాభారతమును రచింపజేసినటువంటిన్నీ రాజరాజ నరేంద్రునకు సంబంధించిన గాథ కాదు. కాని, యీ రోజు వరకున్నూ రాజమహేంద్రవరములో సారంగధరుని కాళ్ళు నరికి వేయబడిన ప్రదేశము ఒకటి ఉన్నదని చూపిస్తూ ఉంటారు. దీనినే "సారంగధరుని మెట్ట" అనే పేరుతో పిలుస్తూ ఉంటారు. ఇదిగో పులి అంటే, అదిగో తోక అన్నవిధంగా లోకంలో వింత వదంతులు వ్యాపించి ఇటువంటి పుక్కిటి పురాణములన్నీ నిక్కమైన ప్రమాణాలు లాగున పరిణమిస్తాయి. ఈ గాథనే పాతహైకోర్టు తీర్పు లాగున ప్రబలమైన సాక్ష్యాధారంగా చూపించి, ఈ ఉదాహరణనుబట్టి సదా అంగనను నమ్మరాదనే భాస్కర శతకం రచించిన మారద వెంకయ్య వాదించాడు. అతడు చూపించిన సాక్ష్యంమీదనే అతని వాదన ఆధారపడియుండినట్లయితే, అతడు చూపిన సాక్ష్యం అబద్ధంగనుక అతని వాదన కూడా శిరసావహింప దగినది. కాదు.

కాని, అతడు చూపించినది ఉదాహరణ మాత్రమే గనుక, అతని ఊహకు తగిన యితర ప్రమాణాధారాలు ఉండవచ్చు - ఘూర్జర దేశమును పరిపాలించిన రాజుల చరిత్రలేఖనముల యందు మన సారంగధరుని కథవంటి కథ ఒకటిఉంది నవనాథ చరిత్రయందు యిది వివరింపబడినట్లుగా తెలుస్తోంది. కాబట్టి సారంగధరుని కథ గాని, చిత్రాంగికథగాని కేవలం మిథ్యయని త్రోసివేయటానికి వీలులేదు.

అయితే ఒక్క విషయం స్ఫుటంగా మనం అంగన విషయంలో అంగీకరించవచ్చు; ఇనుపపెట్టెలలోను ఖజానా గదుల లోను ప్రభువులు బంగారమును వివిధంగా నిల్వచేసి అతి రహస్యంగా అభేద్యంగా దాచియుంచేవారో అదేవిధంగా, తమ అంతఃపురములలో స్త్రీలను కూడా నీళ్ళు సోకిన గదులలో కాపలాభటుల అంగరక్షలతో అతి జాగ్రత్తగా దాచియుంచేవారు అయితే, కాంతా కనకములకు రెండింటికీ సమాన ప్రతిపత్తిలేదు కాంత అనేది ప్రాణం గలిగినది - బుద్ధి సామర్థ్యం కలిగినది. ఆత్మ స్వాతంత్ర్యం, ఆత్మగౌరవం కోరే టటువంటిది. బంగారం అనేది, ప్రాణం

లేని వస్తువు. అయితే, యీ కాంతా కనకములు రెండింటికీ పోలిక ఎక్కడ ఉన్న దంటే, ఈ రెండింటికొరకై మానవలోకము కాంక్ష గలిగియుండుటవల్ల, ఈ కాంక్ష ననుసరించియే సంసారచక్రం అంతా తిరుగుతోంది. భార్యాబిడ్డలమీద కాంక్ష ఉండడం సహజం. దారాపుత్రులకోసమే ధనధాన్యాలమీద కాంక్ష - కనుక, అంగన మీద ఆశ అన్నింటికీ మూలకారణం. స్త్రీని చేపట్టిన తర్వాత సంతానం, సంసారం, వృద్ధిఅవుతుంది. "భరమైతోచు కుటుంబ రక్షణకు"గాను ఆస్తి కావాలి.

కాబట్టి కాంతా కనకములు రెండింటిలోను, ప్రపంచ సంసారచక్రమును నడిపించుటకు మూలహేతువుగాని, ప్రధానప్రాతిపదిక గాని స్త్రీ అని అంగీకరించాలి. అటువంటి మూలకారణశక్తియైన స్త్రీని తృణీకరించడం అవ్యక్తం. అటువంటి స్త్రీని ప్రాణం లేని కనకంతో సమానంగా భావించి, బంగారమును కాశీలో (బ్యాంకిలో) దాచిన విధంగానే తాళం వేసి బంధించడం అవ్యక్తం; అవివేకం— అంతే కాదు అది అపాయకరం.

రాణివాసంలో చాలా మంది స్త్రీలను ఘోషాలో ఉంచినటువంటి రాజులు ఆ స్త్రీలను తాము ఆవిధంగా రక్షించి కాపాడుతున్నామని పైకి వాదించేవారు. రాజు అయినవాడు తన రాజ్యములోని ప్రజలనందరినీ కాపాడి రక్షించవలసిన వాడై యున్నాడు. తన తాలూకు ప్రజలకందరికీ స్వేచ్ఛగా విహరించుటకు అవకాశమిస్తున్నాడు. కాని తన అంతఃపురంలోని రాణులకు అటువంటి స్వేచ్ఛావిహారావకాశం యివ్వడు. అందాకా ఎందుకు? తనప్రజలు స్వేచ్ఛగా తిరిగిన విధంగా రాజు కూడా స్వేచ్ఛగా తిరగడు. రాజుగారు బయటకు బయలుదేరవలెనంటే ఆయనను కాపాడుటకై ఆయన వెంట అంగరక్షకభటులు ఉండాలి. ఎందుచేతనంటే, రాజుగారు బయటకు వచ్చినప్పుడు, ఎవడైనా ఆయనమీద ఒక బాంబువేయవచ్చు. ఇదివరకు నైజాము మోటారుకారులో పోతూఉంటే, ఆయన కారుమీద ఒకడు బాంబు ప్రయోగించాడు. హార్డింజి ప్రభువు గవర్నరు జనరలుగా ఉన్నప్పుడు కొత్తఢిల్లీ నగరంలోకి ఆయన ప్రవేశిస్తూ ఉంటే ఒకడు బాంబు ప్రయోగించాడు. హిట్లరుమీద ఒక సారిగాదు అనేక పర్యాయములు బాంబుప్రయోగం జరిగింది. బ్రిటిష్‌ప్రధాని చర్చిలుమీద గత యుద్ధకాలంలో ఒకడు తుపాకీ కాల్చాడు. ఇవన్నీ వారికి తప్పినప్రాణగండాలు. ప్రభువులకే కాదు, పరమాత్మకైనా ప్రమాదాలు తప్పవు. శ్రీకృష్ణ పరమాత్మునిమీద ఎవడో బాణంవేస్తే ఆ దెబ్బతో ఆయన అవతారం చాలించాడు. గుజరాతులో - గుజరాత్‌లో జన్మించిన గాంధి మహాత్ముడు, ఢిల్లీలో ఒకడు ఆయనపై రివాల్వరు కాల్చిన కారణంచేత, భగవత్ప్రార్థన చేయబోతూ, తన ప్రాణాలు భగవదర్పణ చేశాడు. మహాత్ముని హత్య చేయుటకు ప్రయత్నాలు కుట్రలు జరుగుతున్నవని అనుమానించదగిన సందర్భములు అదివరకే కొన్ని కన్పించాయి. అందువల్ల ఆయన బహిరంగసభా సమావేశములకు నిర్భయంగా పోకూడదనియు, ఆయనకు అంగరక్షకులుగా పోలీసుభటులు కొంత మంది సాయుధులై సదా వెంట ఉండవలెననియు సర్దారుపటేలుగారు కూడా తమ అభిప్రాయం సూచించారు. కాని తనకు భగవంతుడే అంగరక్షకుడనియు భగవంతుని ఆజ్ఞలేనిదే తనకు ప్రమాదమేదియు సంభవింపదనియు, తన సోదర దేశీయులయందు తాను నమ్మకము లేనివాడై వారి నందరినీ అనుమానిస్తూ తాను ప్రవర్తింపజాలననియు, గాంధి మహాత్ముడు సమాధానంచెప్పి పోలీసు బందోబస్తులు తన బహిరంగ సభలలో తనకు అక్కరలేదన్నాడు. ఉండకూడదన్నాడు. భగవంతుణ్ణి నమ్మి భగవత్ప్రార్థనముచేయడానికి సాయంకాల ప్రార్థనా సమావేశాలకు ఆయన హాజరైనాడు. భగవంతుడు ప్రతి మానవ హృదయంలో నూ ఉన్నాడు గనుక, భగవంతుణ్ణి నమ్మిన విధంగానే నా దేశీయుల నందరినీ నేనునమ్మియున్నానని తన ఆత్మ విశ్వాసం అచంచలంగా నిరూపించాడు. అటువంటి - ఆత్మవిశ్వాసం ఉన్న వాడు అఖిలప్రపంచాన్ని నమ్ముతాడు. అతడు అజాతశత్రువు. మహాత్ముని జీవితంలో బ్రహ్మాండమైన ప్రాణగండములు ఎన్నో వచ్చాయి. ఎన్నో తప్పిపోయినాయి. శివుని ఆజ్ఞలేనిదే చీమైనాకుట్టదు. ఆనమ్మకంతో ఆయన ప్రవర్తించాడు. పాకిస్తాను విభాగం అగుటకు పూర్వం తూర్పు బెంగాలులో నవకాళీయందు ఘోరదారుణ హత్యలను పాకిస్తానువాదులగు మహమ్మదీయులు జరిపినందువల్ల ఆప్రాంతమంతయున్నూ రుద్రభూమి అయింది. హిందువైనవాడు అక్కడ అడుగు పెట్టడం పాము పుట్టలో చెయ్యిపెట్టడంవలె ఉంది. అట్టిస్థితిలో గాంధి మహాత్ముడు కాలినడకను ఆ నవకాళీలో మహాకాళికి బలిపీఠమైన భయంకర నరకభూమిలో సంకోచం లేకుండా, సర్వేశ్వరుడే తన సహచరుడుగా, సంచారంచేశాడు. ఆయనకు మానవులందరిమీదా నమ్మకం ఉంది. బ్రిటిష్ వారితో ఆయన హోరాహోరిగా ప్రతిఘటించాడు.

*"This Satanic Government of the British"* (యీ బ్రిటిష్‌వారి సైతాను ప్రభుత్వం) అని దూషిస్తూ సత్యాగ్రహోద్యమ ప్రారంభ దినాలలో గర్జించాడు. కాని, ఆంగ్లేయుడైనవాడు ఎవ్వడూ నాకు శత్రువు కాదన్నాడు. ఆంగ్లేయులు మనకు స్వరాజ్యం తప్పకుండా యిస్తారనే గట్టి నమ్మకం తనకు ఉన్నదన్నాడు. ఈవిధంగా ఆయనకు ప్రతికూలురైనవారిని కూడా ఆయన నమ్మినాడు. మానవుడైన వాడు, ఎంత క్రూరంగా ఎంత ఘోరంగా ప్రవర్తించినప్పటికీ, వాని అంతరాత్మలో సత్యమును ధర్మమును గ్రహించగల సచ్చిదానంద స్వరూపతత్వం ఉంది. గోదావరి జిల్లాలో డొక్కావారి గన్నవరంలో సీతమ్మగారు నిరతాన్న ప్రదానం చేస్తూ ఉండేది. "వండనలయదు వేవురు వచ్చిరేని" "నడికి రేయైన జెట్టు" అన్నట్లుగా

# ★ కాలక్షేపం ★

అన్నపూర్ణాదేవివలె ఉంటూ ఉండేది. అర్ధరాత్రివేళ ఆమె యిల్లు దోచుకొనుటకు వచ్చిన దొంగలకు ఆమె అప్పుడు ప్రసోపేతంగా భోజనం పెట్టి అతిథి సత్కారం చేసింది. అప్పుడు దొంగలు సిగ్గు తెచ్చుకొని తమ అపరాధం క్షమించవలెనని ఆమెను వేడుకొని, తాము అపహరించిన సామగ్రులను ఆమెకు తిరిగియిచ్చి నమస్కారం చేశారు "అంగన నమ్మరాదు" అని ఆ దొంగలు యీ ఆంధ్రమహిళామణి విషయంలో అనలేదు.

కాని, రాజుల విషయంలో వారి రాజ్యాంగ తంత్రముల విషయంలో ఎంత పరాక్రమం చూపిస్తారో అంత అక్రమం కూడా చూపిస్తారు. వారి ఊహలన్నీ వ్యూహాలే - వారి వ్యూహములలో వారే ఒకప్పుడు చిక్కుకుంటారు. శత్రువును వంచించి జయించగలరు. శత్రుపక్షంలోని వారిని కొందరిని లాలించి తమ పక్షమునకు లాగించి శత్రువు గుట్టును తెలిసికొని, కోటలు ముట్టడివేస్తారు. శ్రీరామచంద్రమూర్తికికూడా విభీషణుడు పంచమాంగ దళంలో చేరి పనిచేశాడు. విభీషణుడు అంటే సాక్షాత్తు రావణాసురుని తమ్ముడే. ఆఖరుకు అన్నగారి రాజ్యానికి అతడే అధికారి అయినాడు, శ్రీరాముని దయచేతను.

శ్రీరాముని దయచేతను
నారూఢిగ సకలజనులు నౌరాయనగా
ధారాళమైన నీతులు
నోరూరగ జవులుపుట్ట నుడివెద సుమతీ

అని ప్రారంభించి శ్రీరాముని దయచేతను అనేకములైన లోకరీతులను ధారాళమైన నీతులుగా వ్రాసినటువంటి సుమతీ శతక కర్తయైన బద్దెప్రభువు లేదా బద్దెనామాత్యుడు ప్రభువులను నమ్మకూడదని ఖండితంగా వ్రాశాడు.

"భూమీశుల నమ్మికలను బొంకుర సుమతీ" అన్నాడు.

"ఇంతులు వలతురని నమ్మ
కెంతయు మదిలో
నంతఃపుర కాంతలతో
మంతనములు మాను మిదియు
మతిమర సుమతీ"

అంతఃపురకాంతలను నమ్మి వాళ్లతో మంతనములు చేయ వద్దన్నాడు. కాబట్టి యీవిధంగా "అంగన నమ్మరాదు" అనే మతము రాజులకున్నూ అంతఃపుర కాంతలకున్నూ ముఖ్యంగా ఉద్దేశించి చెప్పబడినదనే మాట నిజం. అంతఃపురకాంతలను రాజులు నమ్మడానికి వీలులేదనే సిద్ధాంతం నిర్వచించినప్పుడు, ఈ అంతఃపురకాంతలు కూడా రాజులను నమ్ముటకు అవకాశం లేదనే సిద్ధాంతం కూడా అంగీకరించాలి సుమతీ! (మంచిబుద్ధి గలవాడా!)—

"నమ్మకు సుంకరి, జూదరి
నమ్మకు మగసాలెవాని
నటు వెలయాలిన్
నమ్మకు మంగడివానిని
నమ్మకుమీ వామ హస్తు
నవనిని సుమతీ"

సన్నాలు వసూలుచేసే వానిని నమ్మకూడదు. వెండి బంగారు పనిచేసే విశ్వబ్రాహ్మణుని నమ్మరాదు. దుకాణం పెట్టిన వ్యాపారస్థుని నమ్మకూడదు. ఎడంచేతితో పనిచేసేవానిని (పురచేతి వానిని) నమ్మకూడదు. నటుణ్ని నమ్మకూడదు, జూదరిని, భోగం స్త్రీని అసలే నమ్మకూడదు.

"వెలయాలు సేయు బాసలు
వెలయగ నగసాలిపొందు,
వెలమ చెలిమియున్
గలలోన గన్న కలిమియు
విలసితముగ నమ్మరాదు
వినరా సుమతీ"

ఈపద్యంలో వెలయాలిని స్వర్ణకారుని నమ్మకూడదని తిరిగీ హెచ్చరించి, వెలమవారితో స్నేహంకూడా నమ్మదగినది కాదని ఏకరువు పెట్టాడు.

ఆ లెక్కన చూస్తే సుమతీ! మంచిబుద్ధి గలవాడా! నీవే వ్యాపారస్థుడవైతే, నీవే సుంకరివైతే, నిన్ను నీవే నమ్మకూడదు. అనాలకూడా అన్నాడు

"కరణము కరణము నమ్మిన
మరణాంతక మౌను సుమ్ము"

అన్నాడు. ఒక కరణమును ఇంకొక కరణము నమ్మకూడదు. ఒక కంసాలి ఇంకొక కంసాలిని నమ్మకూడదు. కంసాలి తన యిల్లాలు అయిన స్త్రీని నమ్మరాదు. తన తోబుట్టువుకూడా స్త్రీ గనుక ఆమెను కూడా నమ్మరాదు. ఒక స్త్రీ యింకొక స్త్రీనికూడా నమ్మరాదు. స్త్రీలుకూడా "నమ్మరాదే చెలీ! మగవారి నిలా నమ్మరాదే చెలీ" అనే ఆలాపన సాగించారు. చిట్టచివరకు ప్రపంచంలో ఎవరినీ నమ్మకూడదు అనే సిద్ధాంతంలోకి దిగింది. "మ్రొక్కిన వరమీని వేల్పు.. మ్రొక్కక విడువంగవలయు" అన్నాడు. అడిగిన వరం యివ్వకపోతే దేవుణ్ణికూడా నమ్మవద్దు అన్నాడు. ఒక వంద రకాలవారిమీద యీవిధంగా విశ్వాసరాహిత్యం ప్రకటిస్తే ఏపక్షంలోనూ మనం చేరలేము. "నమ్మకు సుమతీ" అనే అవిశ్వాస శతకంగా యీ లోకరీతి నీతి శతకం తయారైంది. మూల కారణం ఏమిటంటే, తన నీడనుచూచి తాను అనుమానపడుతూ అతిజాగ్రత్తగా ప్రవర్తించాలని యీ నీతిశతక మతంగా ఉంది. కాని, "సంశయాత్మా వినశ్యతి" అనే సిద్ధాంతాన్నిబట్టి అందరినీ అనుమానించేవాడు అధోగతిపాలవుతాడు. ఈ ధర్మసూత్రమును శిరసావహించినట్లయితే, సుమతీ శతకమును కుమతీ శతకంగా భావింపవలసి వస్తుంది.

మన సంపాదన అత్యల్పమనే విషయం ఎవరికీ తెలియకూడదన్న దిగులుకొద్దీ, మనం మామూలుగా చేసే దుబారా ఖర్చులను మానుకొంటే, ఎంత స్వల్పఆదాయంతోనైనా సుఖంగా బ్రతుకగల అవకాశం లేకపోలేదు.

—ఆర్థర్ గాడ్‌ఫ్రే

అంగన నమ్మరాదని వ్రాసిన భాస్కర శతక కర్తకు వివాహం అయి ఉండవచ్చు. అతని భార్యతో అతడు సుఖంగా కాపురం చేసి ఉండవచ్చు. కాని, లోకానికిమాత్రము యీ పద్యం వ్రాసియిచ్చాడు. కనుక యితని మాట నమ్మవచ్చునా అనే సందేహం కలుగుతుంది.

అయితే ఆ పద్యం అంతా చిత్రాంగి కథ మూలంగా వ్రాసినదే యని అంగీకరించినప్పటికీ, సారంగధరుని వివాహం కోసం రాయబారాలు జరిపి, చిత్రాంగిని చిట్టచివరకు సారంగధరుని తండ్రియైన రాజరాజనరేంద్రుడే వివాహం చేసికొని, చిత్రాంగిని మోసం చేశాడు. అది "తప్పెవరిది?" అనే నాటకంరకంలోకి దిగింది. చిత్రాంగికి ప్రపంచం అంతా మోసంగా కన్పించింది. రాజరాజ నరేంద్రుణ్ని మోసంచేసి సారంగధరునితో సరసాలాడింది. తన ప్రాణంమీదకు రాకుండా "ప్రాణ విత్త మానభంగమందు బొంకవచ్చు నఘము పొందదధిప" అన్నది. అదే రాజనీతిలోని నీతిరాజము. రాజాధిరాజ రాజాజీ అయినా రాజేంద్ర మహేంద్రాజీ అయినా "అసత్యమేవ జయతే" అనే మంత్రం జపిస్తూ "సత్యమేవ జయతే" అనే మంత్రం చాటిస్తాడు. సారంగధరునకు చిత్రవధ చేయించిన చిత్రాంగి తంత్రాంగం చివరకు లోకానికి వెల్లడి అయింది. రాజరాజ నరేంద్రుడు నమ్మదగినవాడైతే, ఆ రాణివాసం కూడా నమ్మదగినదే అయ్యేది. నమ్మకద్రోహం రాజులు సాగిస్తే, రాణులు వెలిజాణలవుతారు. అంతరాత్మలో లేని కల్మషం అంతఃపురంలో పుట్టదు. స్త్రీని అనుమానించి ఘోషాలో బంధించిన లోకానికి "పూరుష గళోద్బద్ధ క్రియాపాశమై" స్త్రీ అనేది పురుషుని కంఠమునకు ఉరితాడు అవుతుంది. ఆమె యొక్క ఆత్మవికాసమునకు అవకాశము కల్పించిన లోకాన్ని ఉద్ధరించగల ఆదిశక్తియై, ఝాన్సీ రాణి కన్న మిన్నయై జగదేక వీరవనితామణియై వెలయగలదు.

ఆత్మధైర్యం ఆత్మవిశ్వాసం కావాలంటే, ధైర్యం సాధకం చెయ్యాలి, విశ్వాసం సాధకం చెయ్యాలి. భగవానుడైన శ్రీకృష్ణుడే తనకు భర్త కావాలని కోరిన రుక్మిణీదేవి ఆ శ్రీకృష్ణుని కంటె అతీతమైన అఖిల జగదాధారశక్తి స్వరూపిణియైన అంబను ఆరాధించింది. స్త్రీ స్వరూపములోనున్న శక్తియందు భక్తి విశ్వాసములు కలిగినప్పుడే మానవ లోకానికి ముక్తి లభిస్తుంది.

నమ్మితి నామనంబున సనాతనులైన
యుమామహేశులన్

# పీచులేని బీరపండ్లు

బీరకాయలు ముదిరితే పండువలె పండి పక్వానికి రావడంగాని, పక్వమయినది మరింత రుచ్యంగా ఉండడంగాని ఎప్పుడూ ఎక్కడా లేదు. లేతకాయలే రుచ్యంగా ఉంటాయి. ముదిరినతర్వాత గిజిగానిగూడువలె, పీచుతో అల్లిన బుట్టవలె, దాని పొట్ట తయారవుతుంది. కాని "అడివి బీరకాయలు'' అనబడే ఒక జాతి బీరకాయ ఒకటి ఉంది. ఇవి పచ్చిగా ఉన్నప్పుడు చేదుగా ఉంటాయి. ముదిరి పండినతర్వాత పసుపు పచ్చని రంగుకలిగి తినుటకు తియ్యగా ఉంటాయి. ముదిరి పండిన పిమ్మట యీ బీరకాయలో పీచు ఏమీ ఉండదు. అప్పుడు అవి రుచ్యంగా భోజ్యంగా ఉంటాయి. అడవులలో తిరిగి శ్రీ బాలరాజు మహర్షిగారు వీటిని సంపాదించారు. అడవి జాతివారు అనగా చెంచులు యీపండ్లను తరచు తింటారు. వారు చూపిన కొన్ని ప్రత్యక్ష చికిత్సానిదర్శనములను బట్టి యీ అడవి బీరపండ్లు క్షయవ్యాధిని నిర్మూలించగలవనియు ఇంకను ఈ ఓషధిని పరిశోధించవలెనని యున్నదనియు వారిఅభిప్రాయము. ఇవి మన ఆంధ్రదేశములోని అడవులలో లభించును.

మిమ్ము పురాణదంపతుల మేలు
భజింతు గదమ్మ; మేటి పె
ద్దమ్మ దయాంబు రాశివి గదమ్మ;
హరిం బతిసేయుమమ్మ; నిన్
నమ్మినవారి కెన్నడును
నాశములేదు గదమ్మ యీశ్వరీ!

ఆ పురాణపురుషుడు (శివుడు) ఆ పురాణ స్త్రీయందు (పార్వతియందు) పూర్తిగా విశ్వాసంగలవాడై ఆమెతో పూర్తిగా ఏకీభవించి తనకు అతురాలా అర్ధాంగిగా ఆమెను స్వీకరించినందు వల్లనే యీ అర్ధనారీశ్వర మూర్తిలోని అంబనే ఆమె నమ్మింది. నమస్కరించింది. స్త్రీయందు నమ్మకం సాధకం చేసే మతం ఇది. అది మతవిశ్వాసం కాదు. అది విశ్వాస మతం. "నమ్మినవారి కెన్నడును నాశములేదు గదమ్మ యీశ్వరీ!" అనేమతం.

నదీమతల్లులన్నీ మనకు స్త్రీతత్వ మూర్తులే—గంగాభవానికి, కృష్ణవేణమ్మకు, "గోదారి తల్లికి - కొబ్బరి టెంకాయ" అని ఆ స్త్రీ ప్రకృతియెడల భక్తితాత్పర్యములు చూపిస్తున్నాము. మన దేశాన్ని దేశమాత అంటున్నాం. ఆంధ్రమాతకూ, భారతమాతకూ స్త్రీ రూపకల్పన చేసి సంకీర్తన చేస్తున్నాము. ఈ భూమి భూదేవి. అండపిండ బ్రహ్మాండరూపమైన యీ జగత్తునే అఖిలాండేశ్వరి అని స్తుతిస్తున్నాము.

కనుక,

"అంగన నమ్మరాదనుట—
యార్యులు నమ్మనిమాట భాస్కరా"

★

శ్రీ పండమూడి సహోదర కుమార్

మధుసూదనరావు ఆఫీసులో పది రోజులు శెలవుపెట్టి - సంక్రాంతి పండుగ ఇంకా వారంరోజు లుండనగా మద్రాసు సెంట్రల్‌లో గుడివాడకు టికెట్ కొనుక్కొని రైల్లో కూచున్నప్పుడు-అంతు లేని ఆలోచనలు- అతనిలో ఒక్కొక్కటే గుప్పున పైకి లేగసాగినాయి. అతని మనో ఫలకంమీద ప్రథమంగా కన్పించిన వ్యక్తి: కమల! అటుపైన అతని తలిదండ్రులూ, ఇతర మిత్రులూ, ఊళ్ళోని గ్రంథాలయం, ఊరిబయట వంతెనా - వరసగా స్మృతి పథంలో బొమ్మలమల్లే కదుల్లాడినాయి. కమల నేరుగా శెలవుతీసుకొని మద్రాసు నుంచి తన దగ్గరకే రమ్మని పది ఉత్తరాలు రాసింది. ఆ ఉత్తరాల్లోని ప్రతి పంక్తీ మధు హృదయంలో నిర్వచించేందుకు వలనుపడని అగణిత భావనలను ఉద్దీప్తంచేసి గిలిగింతలు పెడుతున్నాయి. అయితే వి పరిస్థితిలోనూ-ప్రథమంగా తను జన్మించిన గ్రామాన్ని చూచి...తలిదండ్రుల్ని పలకరించి - మిత్రుల్ని - బంధువుల్ని పరామర్శించి...రెండు రోజులపాటు లైబ్రరీలో పుస్తకాల్ని తిరగేస్తూ కాలం గడపంది - మరోచోటికి వెళ్ళడం సుతరామూ ఇష్టం లేదు. మిత్రులతో కబుర్లేసుకుంటే ఇట్టే కాలం గడిచిపోతుంది. చిన్ననాటి విషయాలూ, హైస్కూల్లో చదివేప్పటి సంగతులూ - కాలేజీ అనుభవాలూ...ఇంకా ఎన్నెన్నో సంగతులు దొర్లిపోతాయి. గ్రంథాలయం గడియారం పది గంటలు కొట్టడంతో అంతా లేవడం - మరల ఊరి బయట - తమిరిశెట్టివున్న వంతెనమీద కూచోని లోకాభిరామాయణంలోకి దిగటం ఇదీ వరస!

బయలుదేరబోయే ముందు రోజున తన మామ రాసిన ఉత్తరంలో కూడా తప్పక రావలసిందనీ, నీకోసం ఎదురుచూస్తుంటామనీ వున్నది. క్రిందటి సంక్రాంతినాటికి తను అవివాహితుడు. హృదయానికి గాలం వేసి తనవేపు లాక్కునే వ్యక్తులు అప్పటికి ఏర్పడలేదు. నిర్విచారంగా, నిర్లక్ష్యంగా స్నేహితులతో ఆ కబుర్లూ ఈ కబుర్లూ చెప్పుకుంటూ కాలం వెళ్ళబుచ్చేవాడు. యూనివర్శిటీ పరీక్షలు రాసి...ఇంటికి రావటంతోనే సంబంధాలు రాసాగినాయి.

కట్నం ఆశే లేకుండానే - పెళ్ళి కుదిరిపోయింది. వాళ్ళ నాన్న కథనం ప్రకారం .. తన మామ.. కాస్త నోరుగలవాడు! గవర్నమెంట్‌లో పలుకుబడివుంది. కాస్తలో తిమ్మిని బమ్మి, బ్రహ్మిని తిమ్మి చేయగల సమర్థుడు. పెళ్ళి కావటంతోనే మద్రాసులో ఉద్యోగమయింది. ఈ రోజుల్లో.. ఇట్టే కాలేజీ వదలగానే ఉద్యోగం దొరకటం ఏమంత తేలికైన పని కాదు. దీని కాశపడే.. తన తండ్రి కట్నం విషయంలో ఎలాంటిపట్టుదలా చూపలేదు. ఇక కమల విషయం: తనకు అన్నివిధాలా తగినపిల్ల! నాలుగోఫారం దాకా చదివి చదువుకు తిలాంజలిచ్చింది......

ఆరునెలల క్రితం తను ఊరువదిలి వచ్చాడు. అప్పటికీ ఇప్పటికీ ఊళ్ళో ఎన్నిమార్పులు వచ్చాయో? తనతోపాటుగా కాలేజీలో చదువుతున్న స్నేహితుల్లో కొంతమంది తప్ప ఇళ్ళదగ్గరే కూచున్నారు. ఒకళ్ళిద్దరు పాసయికూడా పైచదువులకు వెళ్ళలేకపోయారు...కట్నాలు పేరుతో ఏమైనా భాగ్యాలు లభిస్తాయేమోనని...... వాళ్ళ తలిదండ్రులు అల్లుళ్ళకోసం ఎదురుచూస్తున్నారు. వాళ్ళ బ్యాచ్‌లో తనొక్కడే ఉద్యోగరీత్యా ఊరును వదలిపెట్టింది. పట్నాల్లో రోజుకో సినిమా చూస్తూ... మూడునాలుగు ప్యాకెట్లు సిగరెట్లు కాలుస్తూ......కేఫుల్లో కాఫీలు తాగుతూ కాలం వెళ్ళబుచ్చటానికి అలవాటుపడ్డ తన మిత్రబృందం ఆ పల్లెటూళ్ళో ఎలా వున్నదో అని ఆశ్చర్యపడుతున్నాడు. పెళ్ళిళ్ళలో కొంతమంది...పిల్లపాపల్తో ఆడుకుంటూ కాలాన్ని గడుపుతూ వుంటారు! మరి కొంతమంది గ్రంథాలయంలో కూచుని పత్రికల పేజీలు తిరగేసినంతసేపు తిరగేసి ఆపైని ...ఊళ్ళోని పనుల విషయాలమీద వాదోపవాదాలు చేసుకుంటూ వుండొచ్చు! లేదా గ్రంథాలయం అరుగులమీద కూర్చుని పెద్ద మనుష్యులతో-ధాన్యం లెవీరేట్ల విషరాలను గూర్చీ, కృష్ణ ఆనకట్ట రక్షణను గూర్చీ - రాయలసీమ కరువును గూర్చీ, ఆంధ్ర రాష్ట్రం విషయం, పొట్టి శ్రీరాములుగారి నిరాహారదీక్ష విషయం, వివిధ రాజకీయ వర్గాల్ని గూర్చి వాదోపవాదాలు చేస్తూ వుంటారు!

కొత్తగా మున్నబుగిరి వెలిగిస్తున్న తన స్నేహితుడు సీతారామయ్య ఏం చేస్తున్నాడో?......

మధు హృదయంలో రకరకాల భావనలు .. దూదిపింజెలకు మల్లే...పైకి ఎగుస్తున్నాయి. ఏదో ఒక తెలీని ఆనందం ఉబుకుతోంది. హృదయపు అంచులచుట్టూ... అంతులేని భావ పరంపరలు...తేనెటీగలకు మల్లే చేరి ఒక మాధుర్యాన్ని తీసుకొచ్చి పరవశత్వాన్ని కలిగిస్తున్నాయి.

రెండోరోజు ఉదయం మధు ఎనిమిది గంటలకల్లా గుడివాడలో రైలుదిగేడు. పెట్టి, బెడ్డింగ్ కృష్ణమోహన్ అండ్ కో; మిత్రుడిదగ్గర పడేసి...మూడు మైళ్ళ దూరంలోవున్న తన గ్రామానికి కాలి నడకనే బయలుదేరాడు! రోజూ మూడు మైళ్ళు నడిచివచ్చి గుడివాడ హైస్కూల్లో చదువుకున్నప్పటిరోజులు మధు కళ్ళ ముందు ఇట్టే తిరిగిపోయాయి! ఈ బజార్లూ, ఈ దుకాణాలూ...అన్నీ అతనికి పరిచితమైనవే! సెంటర్ దాటి రోడ్డునే నడుస్తాంటే...మధు తనకు తాను...ఉదయం వచ్చి సాయంత్రానికల్లా ఇంటికి తిరిగి పోయే [illegible] విద్యార్థిలా ఫీలయ్యాడు.

గుడివాడ బయటికి వెళ్ళడంతో - వాళ్ళ వూరుమీదుగా వెళ్ళే కాలువ కన్పించింది. కాలువ ప్రక్కనే.. "దొండపాడు 2మైళ్ళు" అని రాసిన బోర్డు వుంది. ఆ పేరు ఒకటికి పదిసార్లు చదువుకున్నాడు. అది అతను జన్మించిన స్థలం. పెరిగి పెద్దవాడయ్యాడు. చదువుసంధ్యలు నేర్చాడు. రకరకాల అనుభూతుల్ని నేర్పింది-ఆ వూరు. ఇలాగే అతని తాతలు, ముత్తాతలు ఇక్కడే పెరిగి వాళ్ళ అలవాట్లను వదిలి వెళ్ళారు. ఇకరాబోయే సంతతికి మధులాంటి ఎంతో మంది యువకులు.. తమ అనుభూతుల్ని, తమ ఆచారాల్ని, తమ సంస్కృతిని వదిలి వెళ్ళారు. వాళ్లు కూడా ఇలాగే...అప్పుడు



"ఏంటోయ్! ఊళ్లోవాళ్లు చస్తుంటే నీ కెందుకా బాధ! వాళ్ల వైషమ్యాలను గూర్చి నీ వేమీ చింతించనక్కర్లేదు!"

'ఇది నా స్వగ్రామం! ఇక్కడ నేను పుట్టి, పెరిగి, పెద్దవాణ్ణయ్యాను' అని సగర్వంగా చెప్పుకుంటారు!

మధు కాలువగట్టునే నడుస్తున్నాడు. సూర్యుడి లేతకిరణాలు నీటి అలలమీద పడి తళతళ లాడుతున్నాయి. నీళ్ళు తన వూరు వేపుకు...చరచరా నడుస్తున్నాయి. భూమిని తడిపి, పొలాల్ని సస్యశ్యామలం చేసి రైతును నాలుగు కాలాలపాటు జీవింపచేస్తున్న కాలవ నీటిమీద మధుకు సాను భూతి ఏర్పడింది. ఏదో ఆనందం పొంగిపోతూండగా...ఒక్కసారిగా నిలబడిపోయి కాలవకు అటువేపూ ఇటువేపూ వున్న పొలాల్ని చూచాడు. ప్రతిచోటా పంట కుప్పలు కన్పిస్తున్నాయి. పొలాల్లో రెండో పైరు మిసమిస లాడుతోంది. జనుం పెరిగి తల లూపుతోంది. మినుము పెసర, పిల్లి మిసర - తీగలు భూమినిండా అల్లుకొని... పచ్చదనంతో కప్పివేశాయి. పొలం గట్ల చుట్టూరీ తాటిచెట్లు...కావలా కాస్తున్న వాటికిమల్లే నిల్చున్నాయి. 'ఈ గ్రామ సీమల పచ్చదనం - ఈ ప్రశాంత వాతావరణం - మరోచోట కన్పించటం దుర్లభం' అని మధు అనుకొని ముందుకు సాగాడు.

ముందుకు సాగుతున్న కొద్దీ...మధు ఆనందానికి హద్దు లేకుండా పోతున్నది. నిండుగా ప్రవహించే కాలవ, కాలవమీద ధగధగా మెరిసే సూర్యకిరణాలు, కాలవ ప్రక్కనే.. వరసగా నిలుచున్న రకరకాల చెట్లవరస; ఆ పచ్చటిచెట్లమీద రంగు రంగులపూలు; ఇలాంటి ప్రాకృతికశోభకు మధు హృదయం నెమిలిలా నాట్యం చేస్తున్నది. ప్రవహించే నీళ్ళతోపాటుగా తనూ ముందుగా నడుస్తున్నాడు. కాలవలో చెట్ల నీడలు కదులుతున్నాయి. బాగా విరిసి, పూచిన రకరకాలపూలు చెట్లనుంచి రాలి కాలవలో ముందుకు సాగుతున్నాయి - పడవలకు మల్లే! కాలవప్రక్కన అక్కడక్కడ చేపలుపట్టుకునేవాళ్ళు కూచుని.. గాలాల్లో ఎరల్ని ఇరికించి వ్యర్థప్రయత్నంలో వున్నారు.

ఊరు సమీపిస్తున్న కొద్దీ...మనుషులు ఎదురవుతున్నారు. యోగక్షేమాలు అడిగి ముందుకు సాగుతున్నారు. ఒకళ్ళిద్దరు - 'కాలేజీకి సంక్రాంతి శెలవలా' అని అడిగేరు. వాళ్ళకు మధు కాలేజీ [illegible] నేసి ఉద్యోగం చేస్తున్నాడనే విషయం [illegible]! ఇంకా ముందుకు సాగినకొద్దీ - [illegible]

## [illegible] ★

కన్పించిన మనిషల్లా మాట్లాడిస్తున్నాడు. ఎవరో అడిగారు - 'ఆఫీసుకు సంక్రాంతి శెలవలా!' అని! స్కూళ్ళకూ కాలేజీలకూ ఆఫీసుల కూడా శెలవలుంటాయనే ఆపల్లెటూరి మనుషుల భావం! ఈ తబ్సీళ్ళన్నీ వాళ్ళకు తెలియాల్సిన అవసరం మాత్రం ఏముంది?

మధు ఊళ్ళోకి ప్రవేశించటంలో అనిర్వచనీయమైన ఆనందం - అతని చుట్టూ పరవళ్ళు త్రొక్కుతోంది! ప్రతి ఇంటికీ సున్నం కొట్టారు. ఇళ్ళముందు రకరకాల ముగ్గులు, ముగ్గులమీద గొబ్బెమ్మలు అతి అందంగా అమర్చబడ్డాయి. ప్రతి ఇంటి ఆవరణల అలంకరణలు రాబోయే శుభసూచకాన్ని ద్యోతకం చేస్తున్నాయి. 'నెల పండం'తోనే చలినైతం లెక్క చేయక.. తెల్లవారుఝాము నాలుగు గంటలనుంచే... 'ఏస్నే నమిన్నారా రామా'! 'హరిభజనమే జీవనమురా' అంటూ రకరకాల అలా వనలతో ఇంటింటికీ తిరిగే హరి దాసుళ్ళు - మధు కంట పడ్డారు. తను బాగా ఎరిగిన మోటూరు హరిదాసుడు నెత్తిమీద అక్షయపాత్ర పెట్టుకొని నత్తి నత్తిగా పదం పాడుతూ......తంబురా - తాళాలు లయతప్పకుండా వాయిస్తూ... తనముందునుంచే...ప్రక్క బజార్లోకి వెళ్తున్నాడు. వదేళ్ళ కుర్రాడు.. తాళం వేస్తూ, పదం పాడుతూ - అతన్ని అనుగమిస్తున్నాడు - పైపెచ్చు చంకలో జోలె తగిలించుకొని! ఊరికి ప్రారంభంలోనే వున్న చాకలివాళ్ల ఇళ్ళముందు కోడి పుంజాలు సంక్రాంతి పండుగరోజు జరగబోయే పందేలకుగాను తయారీలో వున్నాయి. గుడ్డల మూట గూడకు తగిలించుకొని వస్తూన్న చాకలి - మధును చూచి - 'ఏం బాబుగారూ! బాగున్నారా? సాలారోజుల్నుంచి కనిపిచ్చటంలే లేదేమండీ! ఎక్కడేంటి చదివేది - బందరా - బెజవాడా - కాకినాడా?' టూకీగా సమాధానం చెప్పి మధు ముందుకు బయలుదేరాడు. రకరకాల మనుషులు ఎదురవుతున్నారు. కుప్పనూరిపిల్ల కూడావిడిలో వున్నారు - చాలమంది! కావిళ్లతో చెరువునుంచి నీళ్లు తెచ్చుకుంటున్న ప్రతిమనిషీ - మధును పరామర్శించి మరీ ముందుకు సాగుతున్నారు. యుక్తవయసులో వున్న ఆడపిల్లలు మధును చూచి...గబగబా లోనికెళ్లి కిటికీలగుండా తొంగిచూస్తున్నారు. మధు కంటే పెద్దవయసు ఆడవాళ్ళుకూడా ఒకటి రెండు చోట్ల - వాకిట్లో నుంచి గబగబా లోనికెళ్ళి తలుపుచాటునుంచి గుసగుసలాడుతున్నారు - 'బసవయ్య మామగారి మధుసూదనుడు' అని! చెరువుకు కొంచెందూరంలోనే-తనతో చదువుకున్న శాస్త్రి బామ్మగారు మడినీళ్ళు తెచ్చుకుంటూ - మధును చూచి ఆగి-'ఏం బాబూ! మద్రాసులో వుంటున్నావటగా, ఎప్పుడొచ్చావు?... మా అబ్బాయి వాల్తేరులో బి. ఏ. లో చేరాడు. ఇవ్వాళో రేపో వస్తాడు...... అయినా మీరు మీరు ఉత్తరాలు రాసుకోకుండా వుంటారా?...' అని ఏవేవో అడిగి సమాధానాలు చెప్పించుకున్నాక ఆవిడ ముందుకు సాగిపోయింది.

మధు హృదయం పులకితమయిపోయింది. ఈ ప్రేమ, ఈ వాత్సల్యం, ఈ ఆదరాభిమానాలు.. ఇంతకుమునుపు ఇంత మిన్నగా తన కెన్నడూ లభించలేదు. తను ఈ ప్రదేశం వదిలివెళ్ళాక - ఇక్కడి మనుషుల మీద, ఇక్కడి వాతావరణంమీద - ఏదో తెలీని ఆకర్షణ అతని హృదయంలో జనించింది. ఈ కారణంగా రోజూ మధు తన గ్రామాన్ని గూర్చి ఏవో వూహలు అల్లుకుంటూనే వుంటాడు! ఇక్కడ వాళ్ళకు కూడా తనమీద ఇలాంటి భావాలు కలగడానికి కారణం: 'తను మద్రాసులాంటి నగరంలో ఉద్యోగం చేస్తూ ఈ గ్రామానికే పేరు తెస్తున్నానని!' ఇలా ఆలోచిస్తూ మధు చెరువుగట్టుమీదికి వచ్చాడు. అతని సంతోషానికి మేరలేకపోయింది. వూరి మధ్యలో చెరువు! చెరువునిండా నీళ్ళు! నీళ్ళను తామరాకులు పచ్చదనంతో నింపివేశాయి. ఆ పచ్చదనం మధ్యనుంచి... ఎఱ్ఱటి తామరపూలు తమ సౌందర్యాన్ని వెదజల్లుతున్నాయి. దీంతోపాటుగా... తామరాకులక్రింద దాక్కొనివున్న చేపపిల్లల్ని తినేందుకు తెల్లటి కొంగలు...నీటిలోని తామరాకులమీద నిల్చొని జపం చేస్తున్నాయి. ఆ నీళ్ళలో తామరాకుల క్రింద ఊపిరాడక...ఏదో వెలుగును చూచేందుకు చేపలు తామరాకుల్ని చీల్చుకొని పైకెగురుతున్నాయి. అలా ఎగిరినప్పుడు - ఉదయపు సూర్యుని లేతకిరణాలు వాటిమీద ఫోకస్ అయి ఒక క్రొత్త అందాన్ని సృష్టిస్తున్న సమయానికే... ఎప్పటినుంచో కాచుకొని కూచున్న తెల్లటి కొంగలు గబుక్కున ముక్కుల్ని చాపి... ఆ సౌందర్యాన్ని ఒక్క సెకనులో అంతం చేస్తున్నాయి. మధుకు ఇదంతా ఏదో లీలగా తోచింది. ఇదివరకు తనెప్పుడూ పరిస్థితుల్ని ఇలా చూడ్డానికి అలవాటు పడలేదు. ఎందుకో - కొంగల్ని చూచి అనుకున్నాడు. ఇంత అందంగా విరజిమ్ముకొని వున్న సౌందర్యంలో ఏదో ఒక భంగం వాటిల్లుతూనే వున్నది. ఈ ప్రశాంత తటాకంలో కల్లోలాన్ని రేపుతున్న ఈ అసౌందర్యాన్ని తీసేయటం - చాలాముఖ్యం!'

"పేచీ అన్నది రాకుండా మీ దంపతులు ఎలా కాలం వెళ్లబుచ్చుతున్నారో నాకు అర్థం గాకుండా వున్నది. నిజంగా మీ వుభయుల మధ్యా ఎన్నడూ పేచీయే రాదా?"

"రాకేం-తరుచు వస్తూనే వుంటాయి"

"అయితే మరి అవి ఎలా తగ్గిపోతాయ్?"

"ఏముందీ?-పేచీ వచ్చినట్లు నేను మా ఆవిడకు ఎన్నడూ తెలియ నివ్వను. అంతే!"

ప్రశాంతంగా వున్న చెరువు - చెరువులో అత్యంతమనోహరంగా పచ్చటి తామరాకులమధ్య వికసించిన ఎఱ్ఱటిపూలూ వాటి ప్రక్కన తెల్లటికొంగలు - చూడ్డానికి చాలా అందంగా వున్నది - దృశ్యం! కాని దొంగ జపంచేస్తూన్న కొంగల్ని మాత్రం మధు చూచి సహించలేకపోయాడు. ఒక్కసారిగా చెరువుచుట్టూ తిరిగి వాటిని లేచిపోయేట్టు చేయాలని అనుకున్నాడు కాని...చేయలేదు.

చెరువుచుట్టూ రొండుగా కట్టబడివున్న ఇళ్ళూ, డాబాలూ...ఈ ప్రక్కనుంచి అందంగా కన్పిస్తున్నాయి. ఇలా చూస్తూ ముందుకు నడుస్తున్న మధుకు - చెరువు గట్టుమీద - గ్రంథాలయానికి కొంచెం ఇటువేపున...రిటైరయిన ఆఫీసర్లకు మల్లే తామరాకులమీద పొంచికూచున్న కొంగలకు మల్లే - పొలం పనులకు వెళ్ళలేని ముసలా-ముతకా కూచుని.. లంక పొగాకుకూ చేబ్రోలు పొగాకుకూ ఉన్న తారతమ్యాన్ని గూర్చి, వడ్లు బాగా పండిన పాలాల్ని గూర్చి...చర్చించుకుంటున్నారు. ఇలాంటి నాలుగుమూడుతరాల

ముసలివాళ్ళను చూచిన - చెరువు గట్టుమీది మర్రిచెట్లూ, వేపచెట్లూ, జువ్విచెట్లూ గాలికి గలగలమంటూ ఏవో రాగాల్ని ఆలాపిస్తున్నాయి. చెట్లమీద రకరకాల పక్షులు...తరాలనుంచి ఇక్కడే నివసిస్తూ...ఈ చెరువునీరే తాగుతూ జీవనయానం చేస్తూ రకరకాల ధ్వనుల్ని కల్పిస్తున్నాయి.

మధు ఆలోచించసాగాడు-'ఈ పల్లెటూరి వాతావరణానికీ నగరవాతావరణానికీ ఎంత భేదం వుంది? ఇక్కడ 'వసుధైకకుటుంబకమ్' అనేదాన్ని అమలుపరుస్తుంటే-అక్కడ ప్రక్క ఇంట్లో ఎవరుంటున్నారో తెలీదు! విలాసాలకూ, వినోదాలకూ, కేఫ్‌లకూ బీచ్‌కీ-డబ్బు ఖర్చు పెట్టినవాడు గొప్పవాడు! విలాసంగా భోంచేస్తూ కాస్త కాస్త తిని - తక్కిందాన్ని పెంటకుప్పలమీద పారేయించటం ఫేషన్! ప్రతివాళ్ళూ సినిమాల్నిగూర్చీ, గుర్రప్పందేలనుగూర్చీ, క్రికెట్ మేచ్‌ను గూర్చీ - చర్చించుకోవటం సరదా! వీళ్ళలా కాదు - దేశం మొత్తానికే పంటలు బాగా పండించి ఆహారపదార్థాల్ని సరఫరా జేస్తున్నారు. ఇంత తను తిని - మరి ఇంత ఇతరులకు పెట్టే స్థితిలో వున్నారు!

మధు చెరువుగట్టుమీద కూచున్న పెద్ద మనుషుల్ని సమీపించడంతో - వాళ్లల్లోనుంచి ఎవరో అన్నారు-'ఎవరు? మధుసూదనుడా! ఏంరా బాబూ-ఇప్పుడేనా ఏంటి పట్నంనుంచి రావటం? ఏంటి కబుర్లు?' మధు యథోచితంగా సమాధానం చెప్పాడు! ఇంతలోకి వాళ్లల్లో ఎవరో—కాస్త కూచొని మద్రాసు సంగతులేంటో కాస్త చెప్పమని అనటంతో మరొకరు—'ఏంటే కిష్టయ్య బావా! వాడు ఇంటికెళ్ళి స్నానంచేసి కాస్త ప్రయాణపు బడలిక తీర్చుకోవాలంటావా లేదా?' అని అన్నారు. ఇంతలోకే మధు అందుకొని అన్నాడు—'ఏం లేదు కిష్టయ్య బాబాయ్, మద్రాసు రంగురంగుల కాగితపు పూవులాంటిది—చూడ్డానికి చాలా అందంగా వుంటుంది. అయితే దాంట్లో సుగంధం శూన్యం! మన పల్లెటూళ్ళు నిజమైన పూవుల్లాంటివి - ఇక్కడ సుగంధం విరజిమ్ముకొని నలుదిశలకూ వ్యాపించి నవోత్సాహాన్ని రేకెత్తిస్తాయి.' మధు 'మళ్ళీ కన్పిస్తా'నని బయలుదేరుతున్న సమయానికి-మద్రాసును గురించి విన్న కిష్టయ్య బాబాయి అన్నాడు-'మధుసూదనుడూ! పుర్రకోరులో కాస్త చదువుకొని ఉపయోగానికి వచ్చినవాడివి నువ్వొక్కడవే కన్పిస్తున్నావు! అయితే-నీవు మాత్రం నీ తలిదండ్రుల్ని కాస్త కనిపెట్టి వుండు. మీ అన్నవాళ్ళను నానా యాతనలు పెడుతున్నాడు. కట్నం తీసుకోకుండా పెళ్ళిచేసినందుకు మీ నాన్నను-మీవాడు సాధిస్తున్నాడు! నీ చదువు ఖర్చుక్రింద - నీకున్న ఆస్తిఅంతా అయిపోయినట్లు అందరితోనూ చెబుతున్నాడు! కాస్త ఈ ఊబిలోనుంచి బయటపడే మార్గం ఆలోచించు!'

ఈ విషయాలు వినేప్పటికి మధు నవనాడులు ఒక్కసారిగా కృంగిపోయాయి. వాళ్ళ అన్న తనురాసిన ఉత్తరాలకు సమాధానం ఎందుకు ఇవ్వలేదో ఇప్పుడు బోధపడింది. పెంచి పెద్దవాళ్ళను చేసినందుకు వాళ్ళకు లభించాల్సిన ప్రతిఫలం ఇదేనా? మారుమాట్లాడకుండా గబగబా అడుగులేసుకుంటూ దూకుడుగా తన ఇంటివేపుకు వెళ్తున్నాడు. దారిలో ఒకళ్లిద్దరు కన్పించి ఏదో అడిగారు. కాని మధు తమాయించుకొని సమాధానం చెప్పలేకపోయాడు! కొన్ని నిమిషాలక్రితం తనలో ఎంతో ఆనందం పొంగి పొర్లిపోయింది. ఇప్పుడు - ఏదో తెలీని ఉద్వేగం హృదయాన్ని చీల్చుకొని బయటికి రావడానికి ప్రయత్నిస్తోంది.

ఇంటిని సమీపిస్తున్నకొద్దీ అతనిబాధ అధికమవుతోంది. ఆరునెలల్లోనే ఎంత మార్పు వచ్చింది? మనసులు మారడానికి ఒకరోజు చాలు! పైగా దీనికి పెద్దపెద్ద కారణాలు కూడా వుండనక్కర్లేదు! అమృతం ఒలికిపోయినచోట - హాలాహలం ప్రవహిత మవుతుంది. మధు మనస్సులోని భావాల తాలూకు దృఢత్వం ఛేదించబడుతోంది - ముక్కలు ముక్కలుగా!

మధు ఇంటిని సమీపించాడు. బజారు వేపున గోడకు పైఎత్తున ఒక చిన్న మర్రిచెట్టు మొలిచింది. ఆ కారణంగా...గోడ కొంచెం నెర్రెకొట్టింది. చెట్టు పెద్దదయితే గోడ రెండుగా విడిపోవచ్చు! ఇలాంటిది-మధు ఇదివరలో చూడలేదు. మలుపు తిరిగి గబగబా మెట్లెక్కి తలుపు ధడాలున తోసుకొని ఇంట్లోకి వెళ్లాడు! అరుగుమీద నులకమంచంమీద అతని తండ్రి నిద్రపోతున్నాడు! తల్లి వాకిట్లో గడపప్రక్కన కూచొని పాతచీరెకు అతుకులేసి కుట్టుకుంటున్నది. మధు వెళ్లడంతో - చూచి ఆశ్చర్యపడి-'వస్తున్నానని ఉత్తరం రాయలేదేం బాబూ!' అని అన్నది. మధుకు కోపం ఉబుకుతూ ఉబుకుతూ వస్తున్నది. కాని ఆపుకున్నాడు. తల్లివేపు చూచాడు. అతనికి జాలివేసింది. ఒక పాత చీరె చినుగులు కన్పించనీయకుండా కట్టుకున్నది. తన తల్లికి ఇలాంటి దుస్థితి ఎందుకు కలగాలి? 'అన్నయ్యేడీ?' అన్నాడు మధు! 'గొల్వేపల్లి పొలాన కుప్పనూరుస్తున్నాడు! ఇప్పుడే పాలేరు అన్నం పట్టుకెళ్లాడు-' అని సమాధానం చెప్పింది- తల్లి! మధు వదినె - గదిలో పడుకున్నది కొడుకుతో! మధు మాటలు విని బయటికైనా రాలేదు. ఇలా రాకపోవటం మధుకు కష్టమనిపించింది.

కుప్పనూర్పేపనిలో వుండి మధు అన్న - ఆరోజు సాయంత్రం కూడా ఇంటికి రాలేదు. పాలేరు రాత్రి భోజనం కూడా పొలం పట్టుకెళ్లాడు. ఆరాత్రి మధుకు నిద్రపట్టలేదు. 'పెళ్లి చేసుకున్నది-తనయితే నాన్నను సాధించడం దేనికి? తన వంతు అడగాల్సిందేదో అడగొచ్చుగా? ఇంటిగుట్టు రచ్చకెక్కించటం దేనికి? ఈ బోడి ఆస్తి ఎవరికి కావాలి? నా బతుకు నే బతకగలను! కావాలంటే అమ్మానాన్నను కూడా తనవెంట తీసుకెళ్తాను! అంతే గాని ..... ఇక్కడ కూటికీ గుడ్డకూ యాతనపట్టం నాకిష్టంలేదు.' అని ఏవేవో ఆలోచిస్తున్నాడు మధు! ఆ అర్ధరాత్రే-గొల్వేపల్లి పొలం వెళ్లి వాళ్ల అన్నతో-విషయ మేంటో తేల్చుకోవా లనుకున్నాడు. బయట కటిక చీకటులు అల్లుకొని వున్నాయి, మనుషుల్లోని వైషమ్యాలకు మల్లే! ఆ అంధకారంనుంచి ఏవో వింత ధ్వనులు చీల్చుకొని వస్తున్నాయి - మనుషులోని విపరీత భావాలకు మల్లే!

రాత్రంతా అనేక భావనలతో మధు హృదయం కుతకుతలాడింది. ఉదయం అయ్యేసరికి అతనిలో అన్నీ ఇగిరిపోయాయి- వూళ్ళోని మిత్రులూ, చెరువుగట్టుమీది గ్రంథాలయం, ఊరి బయట తమారికి వేపున్న వంతెనా గుర్తుకు రావటంతో!

గుడివాడనుంచి పెట్టే బెడ్డింగూ వచ్చాయి. కాలకృత్యాలు తీర్చుకొని, బట్టలు మార్చుకొని అలా గ్రంథాలయంవేపుకు వెళ్ళడానికి సంసిద్ధుడవుతూన్న సమయానికి - పొలంనుంచి వాళ్ళ అన్న వచ్చాడు. అయన్ని చూచి మధు లోనికొచ్చాడు. వాళ్ళన్న కొంచెంసేపు తటపటాయించాడు. బహుశా తలిదండ్రులిద్దరూ కలిసి తన మీద ఏవేవో చెప్పివుంటారని! ఆ భావం రావటంతోనే...ఏదో బయటపని వున్నవాడల్లే - చావిడి వేపుకు వెళ్ళిపోయాడు. మధు గ్రంథాలయం వేపుకు వెళ్ళాడు!

ఆరోజు మధు ఆనందానికి మేరలేకపోయింది. మిత్రులందర్నీ కలుసుకున్నాడు. లైబ్రరీలోనే! జోలెడన్ని సంగతులు చెప్పాడు. వాళ్లవి అనేకం విన్నాడు! తనతోపాటు చదువుకొని ఫేలయిన విద్యార్థులు మరల మార్చి పరీక్షలకు డబ్బు కట్టారు! ఇక్కడుంటే చదువులు సాగవని సంక్రాంతి పండుగయ్యాక...బందర్లో

# ★ మానవుడు మరణిస్తున్నాడు ★

వుండి చదువుతారట! 'నీకేమోయ్! తెప్ప దాటావు! మేమే నట్టనడి సంద్రాన వున్నాం' అన్నాడు - వాళ్ళల్లోఒకతను! 'తెప్ప దాటకపోవటంలోనే ఆనందం వుంది! మనస్సుకి ఏదీ అంటదు - తెప్ప దాటినాక అన్నీ సమస్యలే! వాటినుంచి తెప్పరిల్లుకోటం మహాకష్టం' అన్నాడు మధు! ఆ సమస్యలేంటో, వాటినుంచి తెప్పరిల్లుకోటం ఏంటో - దీనిమీద వాళ్ళు తర్జన భర్జనలు చేయలేదు! పరీక్షుల్ని గూర్చీ, కాలేజీ లెక్చరర్లను గూర్చీ - అక్కడ చదువుకునే ఆడపిల్లలనుగూర్చీ రకరకాల సంభాషణలు అక్కడ దొర్లిపోయాయి! కాసేపు సినిమాల్నిగూర్చి చర్చించుకున్నారు. ఆపైని రాజకీయాలు! ఆ తరువాత - మద్రాసు అసెంబ్లీ గొడవలు! ఇలా ఒకదాని తరువాత ఒకటి...విసుగు విరామం లేకుండా మాట్లాడుకొని ... సాయంత్రం ఐదుగంటలు కావటంతో - అంతా ఊరి బయటకు బయలుదేరారు! అక్కడ వంతెన మీద కళ్ళి అదివరకే అక్కడ కూచున్న పెద్దమనుషుల జతె జేరి...ఎవరిపొలం బాగా పండిందీ, మినములూ పెసలూ ఏ ధరలో వున్నవీ, క్రొత్త ధాన్యం ఏ ధరన అమ్ముతున్నదీ-లక్ష ప్రశ్నలు వేసి తెలుసుకున్నారు.

రాత్రి ఎనిమిది గంటలకు మధు తిరిగి ఇంటి కొచ్చాడు. వాళ్ళ అన్న బయట మంచంమీద పడుకున్నాడు. మధు వదినె-అరుగుదగ్గర క్రింద కూచున్నది. వాళ్ల నాన్న బయట అరుగుమీద కూచొని... ఎవరితోనో మాట్లాడుకుంటూ చుట్ట కాల్చుకుంటున్నాడు. మధు ముందు వాకిలి దాటి...మరల లోపలి గడప దాటుతుండగా......'మద్రాసు ఉద్యోగం ఎట్లా వున్నది' అన్నాడు వాళ్ల అన్న! మధు ఒక్క నిమిషంపాటు ఆగి 'బాగానే వుంద'న్నాడు. వంటింటి వాకిట్లోనుంచి తల్లి కేకేసింది-నీళ్ళు చల్లారిపోతున్నాయని! ఉభయుల్లో సంభాషణ ముందుకు సాగలేదు. స్నానం చేసి అన్నం తినేప్పుడు మధుతో చెప్పింది, తల్లి-'ఈ ఇంట్లో - నీ పెళ్ళితో మన స్పర్ధలు ప్రారంభమయ్యాయి! మీ వదిన రోజూ ప్రతి చిన్నదానికీ- అనరాని మాటలు అంటుంది. ఇక మీ అన్న మీ నాన్నను సాధించని ఘడియ లేదు. స్కూలు ఫైనలు చదువుకున్న మోడుకు ఆస్తి ఏమీ లేకపోయినా పదివేలు కట్నం దొరకుతూంటే - నీవిషయంలో చేతులారా మీ నాన్న చెడగొట్టాడని - వాడి సాధింపు! మధు మారుమాట్లాడలేదు. స్నేహితుల మధ్య కూర్చొని రావటంవల్ల హృదయమేదో తేలికగా వుంది. ఇప్పుడు మరల - ఆలోచనల భారాన్ని మోసేందుకు అతనికి ష్టం లేదు. గ్రామసీమల కుటుంబాలు నిర్విచారంగా జీవనయానం చేస్తూ పోవాలని అతని అభిలాష! వైషమ్యాలకు అక్కడ తావుండకూడదు!

మధు తల్లి ప్రేమతో పెట్టిన అన్నం తిని-వసారాలో వేసిన మంచం మీద మేను వాల్చాడు! ఊరికి మధ్యలో చెరువు, చెరువుగట్టుమీద - పెద్ద బజారుకు ఎదురుగా గ్రంథాలయం, గ్రంథాలయం ప్రక్క నే కూచునే పెద్దమనుషులు-తామరాకులమీద, వికసించిన పూలప్రక్క చేపలకోసం... నిశ్చలంగా నిలబడి వుండే తెల్లటికొంగలు" ఇవే మాటిమాటికీ అతని ఎదుట సినిమా బొమ్మలకు మల్లే కదుల్లాడుతున్నాయి. మధ్య మధ్యన తనకూ తన సోదరునిమధ్యా వున్న దూరాన్ని కొలుస్తున్నాడు.

* · * *

బ్రహ్మముహూర్తం వేళ.. ఊరంతా సందడిగాఉంది. పొలాలు వెళ్ళేవాళ్ళు వెళ్తున్నారు. కావిళ్ళతో నీళ్ళు తెచ్చేవాళ్లు తెస్తున్నారు. హరిదాసుళ్ళు...రోజుకిమల్లే - 'నిన్నే నమ్మినారా రామా!' అంటూ బయలుదేరారు! నవయువతులకు ముగ్గువేయటం సరదాగావుంటే...అంతకంటే చిన్నపిల్లలకు గొబ్బిమ్మలు చేయటం సరదాగా వున్నది. ఎనిమిదిగంటలదాకా నిద్రపోవడానికి అలవాటుపడ్డ" మధు... ఒక్కసారిగా బైట ఏదో పెద్ద గలాభా విన్పించేప్పటికి ఉలిక్కిపడి లేచాడు! ఆ గందరగోళం తనింట్లోదేమో అనుకున్నాడు' కాని అది పూర్తి గ్రామానికే సంబంధించిందని - మధుకు తెలీలేదు. 'ఏమిటి? ఏమిటి?' అంటూ హడావిడిగా బయటికివచ్చాడు. జనం గుమిగూడి - 'నారాయణమూర్తి మరణిస్తున్నాడు!' అని కేకలు పెడుతున్నారు. మధుకేకంలో ఒక్కసారిగా రక్తసంచారం ఆగిపోయినట్లనిపించింది. 'పంటకాలవ ప్రక్కన ఎవరో చంపి పడేశారు.. రక్తం కాలవగా పారుతున్నదట - ఇంకా కొన ప్రాపిరుంది' - ఈమాటలు మళ్ళీ జనంలోనుంచి వినిపించాయి. కాని మధుకు బోధపడలేదు. 'ఆయన ఎందుకుమరణిస్తున్నాడు-ఎవరీ ఘాతుక కార్యానికి ఒడిగట్టారు?' అని బిగ్గరగా అరుస్తూ అక్కడ నిలుచున్న జనాన్ని అడుగుతున్నాడు. ఇంతలోకే మధు తల్లి బయటికి పరుగెత్తుకొనివచ్చి - రెక్కపుచ్చుకొని లోనికి తీసుకెళ్ళింది. వాళ్ళనాన్న...మధును ఉద్దేశించి అన్నాడు - "ఎందుకురా నీవిలా ఉద్రేకపడతావు? ఇక్కడ మనుష్యుల్లో లోపల లోపల రాజుకునే ద్వేషాల ఫలితమే ఈ హత్య! ఒకళ్ళను చూస్తే మరొకళ్ళకు గిట్టదు! ఎవడైనా నాలుగు డబ్బులు సంపాయించుకుంటూంటే ఓర్వలేని తనం! ప్రతి నిత్యం...ఈ పెద్దపెద్ద రైతులదగ్గర చిన్నకారు రైతులంతా దాసోహం అంటూ వుండాలి! క్రిందటి సంవత్సరంనుంచే మన స్పర్ధలు మరింత పెరిగిపోయాయి! కమ్యూనిస్టుల హడావిడి జాస్తిగా వున్నప్పుడు... ఊళ్ళోని ఒకళ్ళిద్దరు పెద్దమనుషులు పోలీసుల్ని వెంటేసుకొని...వాళ్ళకు గిట్టనివాళ్ళందర్నీ కమ్యూనిస్టులేనని చెప్పగా... వాళ్లను యమయాతనలకు గురిజేశారు పోలీసులు! బూతులు తిట్టారు. ఇంట్లోవున్న సామాను చిందరవందర జేశారు. పచ్చళ్ళ జాడీలు పగలగొట్టారు. గుడివాడ తీసుకెళ్ళి బాగా చితకగొట్టి పంపించారు! అయితే, నిజంగా వాళ్లు కమ్యూనిస్టులు కారు! కక్షసాధించుకోటానికి చేసిన కుతంత్రం ఇది! దాంతో ఊళ్ళో రెండు పార్టీలయ్యాయి! క్రిందటి ఎన్నికల్లో కమ్యూనిస్టులంటే ఇష్టం లేకపోయినా...గ్రామ తగాదాల్ని పురస్కరించుకొని-ఒక పార్టీవాళ్ళు కమ్యూనిస్టులకే ఓట్లిచ్చారు. వైషమ్యాలు రాజుతున్నాయి. అబద్ధపు సాక్ష్యాలతో, దొంగ పత్రాలతో అనేక కేసులు నడిచాయి-ఉభయుల మధ్యా! ఒక బంజరుభూమి సాగు విషయంలో కూడా ఒక వర్గంవాళ్లు అటకాయిస్తే మరొక వర్గం 144 సెక్షను తెప్పించి పోలీసుల ఆసరా తీసుకున్నది. పోతే, రోజూ పొలం నీళ్ళవంతులదగ్గర తగాదాలే! ఇవి రోజురోజుకీ ముదిరిపోతున్నాయి. పెద్ద పెద్ద రైతులంతా వెనకుండి చిన్నకారు రైతుల మధ్య తగాదాలు పెంచి కేసులు నడిపిస్తారు. ఈ కేసులు ఫెడరల్ కోర్టు, ప్రివీకౌన్సిల్ దాకా కూడా నడిపించడానికి వీళ్ళు ఎల్లప్పుడూ సిద్ధమే! ఖూనీలు జరగడం ఇదివరకెప్పుడూ లేదు. ఇదే మొదలు!...ఆపామాషీగా తిరిగే మీకుర్రాళ్ళకు ఈ విషయాలన్నీ తెలీవు మీకే గాదు - బయటి ప్రపంచానికే ఇక్కడి లోతుపాతులు తెలీవు! తెలుసుకొని కూడా ఎవరేమీ చేయలేరు!"

ఇవన్నీ విని మధు కొయ్యబారిపోయాడు! పెదిమల చివర గుడ్పాటు క[illegible]గింది. కనురెప్పలు చెమ్మగిల్లాయి. ఏదో దుఃఖం ఉబుకుతోంది. మారుమాట్లాడలే[illegible]

మధు మరల బయటికి వచ్చి నిలుచున్నాడు! బయట ఎవరూ లేరు. ఆలోచనలభారంతో క్రుంగిపోతున్న మధు- బయట అరుగుమీద కూలబడ్డాడు. ఇంతలోనే మరల ఏదో గల్లంతు విన్పించింది. మధుకు లేవ బుద్ధి వేయలేదు. అలాగే కూచొని ఆలకిస్తున్నాడు. గందరగోళం తనను సమీపించింది......'నారాయణమూర్తి శవంతోనే మరో శవం కూడా ఈ రోజు శ్మశానానికి వెళ్తుంది. వాడెవడో మాకు తెలుసు! వాడి రక్తాన్ని ఇవ్వాళ్ళ కళ్ళచూస్తాం. మేమంత చేతులు చచ్చిలేం!' ప్రతిపక్షంవాళ్ళు కేకలు పెట్టుకుంటూ వస్తున్నారు. మధు అటువేపు తేరిపారజూచాడు! ఒక మంచం మీద చచ్చిపోతున్న నారాయణమూర్తిని పడుకోబెట్టి ఇంటికి చేరుస్తున్నారు. ఇంకా రక్తం క్రింద కారుతూన్నది. తల రక్తపు ముద్దలాగా కన్పిస్తున్నది. ఒక చెయ్యి వూడిపోటానికి ఇంకొంచెం పట్టున్నది. వంటిమీది గుడ్డలు అస్తమిస్తున్న సూర్యుడిలా వున్నాయి.

మధు మనస్సు వికావికలైపోయింది. ఆనందం వెల్లివిరిసిపోవలసిన పల్లెపట్టుల్లో ఇలాంటి ఘోరతమఘటనలుజరిగిపోతాయని మధుస్వప్నంలో కూడా ఊహించలేదు. మానవుడు మరణిస్తున్నాడు. మానవత్వం నశిస్తోంది. మరణిస్తున్న మానవుణ్ణి,నశిస్తున్న మానవత్వాన్ని...రక్షించాల్సిన బాధ్యత తనమీదే వున్నట్లు మధు భావించాడు. మార్గోపాయంకోసం ఆలోచింపసాగేడు. 'ఒకరినొకరు చంపుకోవటం వల్ల మీరేమీ సాధించలేరు ..పరిస్థితుల్ని సమన్వయం చేసుకొని జీవించటానికి ప్రయత్నం చేయండి. మీ బిడ్డలకు మీరు ఒక నూతన పథాన్ని చూపించండి' - అని ప్రతి ఇంటికీ వెళ్ళి చెబుదామనుకున్నాడు! స్నేహితుల్ని ఏకంచేసి...'మన తండ్రుల హృదయాల్లోవున్న వైషమ్యాల్ని తీసేసి ఒక నూతన జగత్తును మనం సృష్టించి రాబోయే తరం వాళ్ళకు ఒక ఆదర్శాన్ని ప్రదర్శిద్దాం!' అని ప్రబోధం చేయాలనుకున్నాడు! క్రొత్తగా మున్సబుగిరి చేస్తున్న స్నేహితుణ్ణి కలుసుకొని- 'ఈపరస్పర ద్వేషాలు అంతరించే విధానం ఆలోచించమని ప్రాధేయపడాలనుకున్నాడు. కాని మధు కూచున్న చోటినుంచి లేవలేకపోయాడు!

ఆపూట మధు అన్నంతినలేకపోయాడు. తల్లీ తండ్రీ ఇద్దరూ బ్రతిమలాడారు. వినలేదు. ఉదయంనుంచీ బయట అరుగుమీద నిశ్చలంగా కూచున్న మధును ఉద్దేశించి వాళ్ల అన్న అన్నాడు - 'ఏంటోయ్! ఊళ్లోవాళ్ళు చస్తుంటే నీకెందుకాబాధ! వాళ్లవైషమ్యాల్ని గూర్చి నీవేమీ చింతించనక్కర్లేదు!' మధుకు ఉద్రేకం ఆగలేదు. ఈ విషయంలో వాళ్ళ అన్న తనకు సలహా ఇవ్వటం సుతరామూ ఇష్టంలేదు. అందుకని అన్నాడు. 'నీలాంటి వాళ్ళవల్లనే గ్రామాలిలాతగలడ్డాయి. మీరు ముందు కుటుంబాల్లో చిచ్చురగిలిస్తారు. ఆ తరువాత అది అనేక గ్రామాలకూ, ప్రాంతాలకూ, దేశాలకూ ఆవరిస్తుంది. నీలాంటి వాళ్ళు యావత్ ప్రపంచానికేముప్పుచేటు!' ఆతరువాత మధుఅక్కడఆగకుండా బయటికెళ్ళిపోయాడు. బజార్లో ఒక్క పురుగూ కన్పించలేదు. అందరూ బజారువేపు తలుపులు బిడాయించుకొని లోపల కూచున్నారు. చెరువు గట్టుమీద కూడా ఎవరూ కన్పించలేదు. గ్రంథాలయం తలుపులు కూడా మూసుకొని వున్నాయి. మద్రాసు అసెంబ్లీ చర్చల మీదా, హిందుస్తాన్ సరిహద్దులమీది సంఘర్షణలను గూర్చీ, కొరియాలో జరిగే అమెరికన్ విమానదాడుల్ని గూర్చీ - వాదోపవాదాలు చేసుకునే - తన స్నేహితుల్లో ఒక్కడూ అక్కడ కన్పించలేదు. గ్రంథాలయానికి సమీపంలో కూర్చొని - జీవిత నశ్వరత్వాన్ని గూర్చీ, కర్మఫలాన్ని గూర్చీ చర్చించుకుంటూ - 'ఇది అంతా ఏ జన్మలోనో చేసుకున్న పాపఫలం! అసలు కలియుగంలో ధర్మమే ఒక పాదం - అదీ పూర్తయిపోయింది.' అని చెప్పుకునే పెద్ద మనుషులు అక్కడలేరు! కనీసం లంకపొగాకు ప్రాశస్త్యాన్ని గూర్చి చర్చించుకునే ముసలాళ్ళు సైతం అక్కడ కన్పించడంలేదు. అటూ ఇటూ తేరిపారజూచి మరల తిరిగివచ్చి మధు గ్రంథాలయం ముందున్న అరుగులమీద కూచున్నాడు దిగాలుపడిన హృదయంతో!

మరల వెనక్కి తిరిగిచూచాడు. గ్రంథా

[55 వ పేజీ చూడండి]

## ★ అనాది వృత్తి ఏది? ★

ఒక డాక్టరు, ఒక యింజనీరు, ఒక రాజకీయ వేత్త ముగ్గురూ ఒకరోజున ఒకచోట సమావేశమై, 'ప్రపంచంలోకల్లా అతి పురాతనమైన వృత్తి ఏదీ' అనే విషయం మీద వాదోప వాదాలు ప్రారంభించారు.

ముందుగా డాక్టరు వైద్య వృత్తే అతి ప్రాచీనమైనదని అంటూ, అందుకు తార్కాణంగా బైబిల్ లోని భాగాన్ని యిలా వుటంకించాడు. "ఆదిలో ఆదామును మాత్రమే సృష్టించిన భగవంతుడు, ఆ ఆదాము అస్థిపంజరంలోని ఒక ఎముకను తుంచి, అందులో నుంచే హవ్వాను సృష్టించాడు. ఆ ఎముకను తుంచటమంటే అది శస్త్రప్రయోగానికి సంబంధించిన విషయం"

వెంటనే యింజనీరు అందుకుని "ఆదామును సృష్టించకపూర్వమే భగవంతుడు కల్లోలంలో నుంచే యీ విశ్వాన్ని సృష్టించాడు. అలా కల్లోలంలో నుంచీ విశ్వసృష్టి జరిగిందంటేనే, అందులో ఎంతో యింజనీరింగ్ పనితనం యిమిడి వుంది" అన్నాడు.

ఆయన ఆ వాక్యం ముగించీ ముగించక ముందే, రాజకీయ వేత్త కల్పించుకొని, "ఆ! ఆ! అట్టె! అట్టే - విశ్వ సృష్టికి పూర్వం కల్లోలం వున్నదన్నావే - అదెవరు సృష్టించారూ? - మా రాజకీయ వేత్తే!" అన్నాడు.

# సంసారం

"ఏమేవ్ ఇలారా."

"............"

"ఈశ్వరా! నా గొంతుక చించుకొన్నా దానికి వినబడదే. ఏమిచేయను భగవంతుడా."

"వస్తున్నానండీ, అంతలోకే దేముళ్ళకు దయ్యాలకు చెప్పవలసిన అవసర మేమొచ్చిందండీ."

"నిన్ను పిలవాలంటే రేపటినుంచి ఇంటినిండా లౌడ్‌స్పీకర్లు పెట్టించాలి. ఒకసారా! రెండుసార్లా!! లక్షసార్లు గొంతుక బొంగురు పోయేటట్లు పిలిచాను. అదిగాక ఏమికాలమే!"

"కాలాని కేమండీ. అయినా నే నొచ్చానుగా. ఇంకెందుకండీ భాగోతం."

"కాలానికి కాదూ. మాకాలంలో ఇలాగ చేశామా. ఓయ్ అంటే ఆ మాట పూర్తిగాకుండానే ఆఁ అని సమాధానం చెప్పేవాళ్ళం. అయినా ఎప్పుడేనా ఎదురు చెప్పామా. నేను చెప్పేదంతా నీకు భాగోతం అయిందటే. ఏమి విడ్డూరం. ఏమి విడ్డూరం."

"విడ్డూరాని కేమొచ్చిందిప్పుడు. ఉల్లిపాయలు తరుగుతుంటే వాళ్ళ కోడలు కాంతంవచ్చి ఏవో చెప్తుంటే ఆలకిస్తున్నాను. ఇంతలోకే భంయ్, భంయ్‌మని మీరు కేకలు మొదలుపెట్టారు. వచ్చినవారు ఏమనుకుంటారండీ. నాగరికత తెలుసుకొని మాట్లాడాలిగాని."

"అదేమిటే. పనిచేస్తూ వూసులు వింటుంటే నా పిలుపులు నీకు వినిపిస్తాయా. నేనేమి కుక్కనా భంయి, భంయిమని అరవటానికి. ఇదంతా నా కర్మం. ఈ కాలపు కోడళ్ళు అత్తల్ని కుక్కలక్రిందా, పందులక్రిందా జమకట్టేస్తున్నారు. ఎంత మార్చేశావురా భగవంతుడా."

"ఇంక రాగాలు మొదలెట్టారేమిటి. మీ అబ్బాయి వచ్చేవేళయింది ఇంక ఊరుకుందురూ."

"అబ్బాయి లేనప్పుడు నోటికివచ్చిన మాట లనటమూ, రాగానే ఏమీ ఎరుగని నాంచారిలాగ వుండటమూనా! ఏమి జిత్తులమారివే. నీతో నేను వేగలేను. నేను యింక ఈ యింట్లో వుండే ఆశలేదు" అని కాళ్ళు చాపుకొని, కూనిరాగాలు పెట్టూ, పంచెకొంగుతో కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ కూర్చుంది నారాయణమ్మ.

అప్పుడే లోనికి వస్తూ తల్లి మాటలు విన్నాడు సుదర్శనం. ఆఫీసులో కళ్ళు చించుకొని చేతిలోని పార్కరుపెన్నుకు పనిచెప్పి, తను చిన్నపుడు వున్న ఆస్థి రెండెకరాలు కట్టి కప్పచెప్పి నేర్చుకొన్న అక్షరాలు, అంకెలూ వ్రాసి ఉసూరుమంటూ ఇంటికి వస్తే, యింటిదగ్గఱ అత్తాకోడళ్ళ యుద్ధం. ఏదో పూర్వపు మనిషి, అని లక్ష్మి వూరుకోదు. పెద్దదయి యుండి కూడా చిన్నదాని లెక్కేమిటని అమ్మ ఊరుకోదు. మధ్య తను నలిగిపోవటం తప్ప ఏమీ ప్రయోజనం లేదు. అమ్మకు ఆగ్రహం వచ్చినా, అనుగ్రహం వచ్చినా పట్టడానికి ఇంద్రాదిదేవతలుకూడ చాలరు. సుదర్శనం ఎవరిని ఏమనగలడు? అటు కన్నతల్లి, ఇటు భార్య. ఇలా ఆలోచిస్తూ అలసిపోయిన సుదర్శనం "లక్ష్మీ" అని చిన్న కేక వేశాడు.

"ఆఁ" అంటూ ఎదురుగా 'టీ'తో ప్రణయాంబుధి నిల్చునివుంటే తన కేదో చల్లని గాలి వీచినట్లు అలసిన నరాలకు సేద దీర్చినట్లయింది.

"టీ త్రాగండి" అన్న మృదువైన మాటలు, పోయిన ప్రాణాన్ని మళ్ళీ బొందెలో పడవేసినై.

పేదకు దొరికిన పెన్నిధివలెనున్న అమృతములాగ, ఒక్కొక్క గుటక వేస్తూ, చిరునవ్వు తొలకరించుచున్న సుందరముఖాన్ని చూస్తూవుంటే తనకు గలిగిన అలసటఅంతా పోయి తనలో ఒక నూత్న తేజో వికాసాన్ని గలిగిస్తుంది.

ఏమీ తోచక పిచ్చివానివలె, అయస్కాంతపు పద్మముల్లాగ ఆకర్షిస్తున్న ఆమె సొగసు కళ్ళలోకి చూస్తూ కూర్చున్నాడు. సుదర్శనానికి ఆమె ఒక రంభలాగ కనిపిస్తుంది.

"నీలో ఎన్నడు చూడని అందాన్ని చూస్తున్నాను లక్ష్మీ."

"పోదురూ" అని ఖాళీ చేసిన టీగ్లాసు తీసుకొని లక్ష్మి తుర్రుమని లోపలికి వెళ్ళిపోయింది.

* * *

"రండి అన్నయ్యగారూ! చాలరోజు లయిందండి మీరు వచ్చి. ఏదో దారి తప్పి వచ్చినట్లున్నారు"

"దారి తప్పట మెందుకండి. రావాలనే వచ్చినప్పుడు."

"దాని కేమిలెండి. అమ్మా! లక్ష్మీ! నాన్నగారికి చెంబుతో నీళ్ళు తీసుకురా కాళ్ళు కడుక్కుంటారు."

లక్ష్మి చెంబుతో నీళ్ళు తీసుకవచ్చింది. తన తండ్రి ఎందుకు వచ్చాడో తనకు తెలుసు. అందుకు అత్తగారికి యిష్ట ముండదని కూడ తెలుసు.

"అన్నయ్యగారూ! మీ వూరి విశేషాలేమిటండి. పరిస్థితులు ఎలాగున్నాయి. ఏమిటి సంగతి. అయ్యో! నామతి మండ. ఏమే అలా చూస్తూ నుంచొన్నావేమే. నాన్నగారికి టీ చెయ్యమ్మా! అదిగాక అన్నయ్యగారూ! లక్ష్మి వట్టి పిచ్చిపిల్లయిపోయిందండీ."

"అత్తగారి తెలివితేటలు ఏమీ అబ్బలేదనుకుంట."

"నా తెలివితేట లబ్బితే బాగుపడిపోను. నా ఆచారాన్నంతా మంట గలుపుతున్నారు. ఎంతో పూజనీయంగా చూసుకుంటున్న "గోవిందనామాలు" పుస్తకం ముట్టుకోదుగదా! కన్నెత్తి అయినా చూడదంటే నమ్మండి. ఏమిటో తగనిగోడవొచ్చిపడిపోయిందండీ. మా కాలంలో..." అని ఏమో చెప్పబోతూండగా,

"అబ్బాయి ఇంకా రాలేదే. వచ్చే టయమయింది" అని లక్ష్మి తెచ్చియిచ్చిన టీ త్రాగి ఇప్పుడే వస్తానని చెప్పి అలా బజారుకు వెళ్ళాడు నర్సయ్య.

నర్సయ్య డబ్బుగలవాడు. సుదర్శనం వారియింటికి మట్టపుమాపుకు వెళ్ళాడు. వారికి వీరికి బాదరాయణ సంబంధంవుంది. సంబంధంవున్నా కలుగజేసుకొని ఒకరి యింటికి పదేపదే వెళ్ళే రకంగాదు సుదర్శనం. చదువుకున్నవాడూ, వరుసకు కూడా తగినవాడూ, బుద్ధిమంతుడూ అని సుదర్శనానికి తన కూతురి నివ్వదలచాడు నర్సయ్య. లక్ష్మికూడా అందుకు ఇష్టపడింది. సుదర్శనం తండ్రి తన కొడుకు

"అప్పుడే చెయ్యిపెట్టావు కేం. నీవు ఏది పట్టుకున్నా అది భస్మమవటమే తప్ప ఏమీ మిగులదు."

వివాహం చూడకుండానే చనిపోయాడు. తండ్రి సంపాదించిన రెండెకరాలు తన చదువుకు అయిపోయాయి. సుదర్శనం స్వంత రెక్కలమీద ఇల్లు అనేది కూడ కట్టాడు. ఆ యింటిలో ఒకభాగం వారికి వుంచుకొని మిగిలినభాగము అద్దెకిచ్చాడు. తల్లి నారాయణమ్మ, లక్ష్మి, సుదర్శనం. ఇదే వారి కుటుంబం. పండుగకు లక్ష్మిని తీసుకు వెళ్ళుదామని నర్సయ్య వచ్చాడు.

ఆ రాత్రి భోజనాలయ్యాక లక్ష్మి తండ్రికి పడక అమర్చి, అత్తగారి పడక గురించి తనకు శ్రోక్యము లేదు గనుక సుదర్శనం గదిలోకి వెళ్ళి దగ్గర కూర్చొంది. సుదర్శనం భార్యతో

"మీ నాన్నగారితో వెళ్తావా" అని అడిగాడు.

"మీ యిష్టం. మీరు పంపితే వెళ్ళుతాను" అని అదోలాగ చెప్పడం చూచి

"ఏం లక్ష్మీ! అలాగున్నావు. సంగతేమిట"ని బుజ్జగించి అడిగాడు.

"మనకో బుజ్జి పాపాయి త్వరలోనే మనకు సంతోషాన్ని గల్గించడానికి మనింటికి రాబోతున్నాడు" అని చిరునవ్వుతో చెప్పింది.

"అమ్మ దొంగా! అయితే ఆఱవ నెలన్నమాట" అని సుదర్శనం ఆలోచించి చెప్పాడు.

"అమ్మను అడిగావా"

"మీ అమ్మగారిదో మతం గాదు. ఇప్పుడన్నా మాట తర్వాత ఉండదు. అందు చేత..."

"ఏదెలాగయినా ఆమె మన యింటిపెద్ద. ఏమీ అడ్డు చెప్పదులే."

"అందుచేత"

"అడగమని అంటున్నాను." అని చెప్పి లక్ష్మిని తనవైపుకు లాక్కున్నాడు.

"చాల్లెద్దురూ! నేర్చారు" అని లక్ష్మి తన పక్కమీదకు వెళ్ళిపోయింది.

* * *

సుదర్శనానికి నిజంగా పిచ్చిపట్టినట్లుగా ఉంది. లక్ష్మివెళ్ళి కొన్ని నెలలు గడిచినై. బుధవారంకోసం ఎదురుచూస్తూ వున్నాడు. ఆనాడు లక్ష్మి ఓ బుజ్జాయితో వస్తుందని టెలిగ్రాము వచ్చింది. నిజంగా కాలము మీద, కాల వేగముమీద చాల కోపము వచ్చింది. టెలిగ్రామువచ్చిన దగ్గఱనుంచి మరీ మందంగా గడియారం తిరుగుతున్నదనుకొన్నాడు. సరిగ్గా ఆరోజు, ఆగంట, ఆ నిమిషానికి బండి ప్లాటుఫారముమీద ఆగింది. అంతకు గంటనుంచి ప్లాటుఫారాన్ని సుదర్శనం తన కాళ్ళతో అరుగదీస్తున్నాడు. చిరునవ్వుతో లక్ష్మిముఖం కనుపించేసరికి చేతిలోని పిల్లవాడిని గబుక్కున తీసుకొని గట్టిగా అదుముకొని బుగ్గ కొరికాడు.

"అరె! ఎంతపని చేస్తున్నారు!! అంత తొందరవుతే ఎలాగు. ఆగండి" అన్న భార్యమాటలు విని తల పైకెత్తి చూచాడు. లక్ష్మి, ఎవరన్నా చూస్తే నవ్వుతారని, వెక్కిరిస్తున్నట్లుగా చూచింది. నీకోసం

నారాయణమ్మ ఎదురుచూస్తుంటుందిరా." అని ఓ కూలివానిని చూచి యింటికి బండి కట్టించుకొని వచ్చారు. గుమ్మములో నుంచే నారాయణమ్మ పిల్లవాడికి దిష్టి తీసి లోపలకు తీసుకవెళ్ళింది.

లక్ష్మి కూడా లోపలకు వస్తుంటే,

"అదేమిటి పిల్లా! బుద్ధి వుండ నక్కర లేదటే! కాళ్ళు కడుక్కోకుండా లోపలకు వస్తావా? అయినా నే వేగలేనమ్మ ఈ యింటిలో! మా కాలంలో..."

"వేగనియ్యక నే నేం పట్టుకొన్నా నా" అని అడ్డు వచ్చింది లక్ష్మి.

"పట్టుకొన్నా నోరు మూసుకొని వుండవలసిందే" అని కళ్ళనీళ్ళు పెట్టుకొంది నారాయణమ్మ.

"అదేమిటే అమ్మా! అప్పుడే కళ్ళనీళ్లు పెట్టుకోవలసిన అవసరం ఏమొచ్చింది. అది చిన్నది. దానికి తెలియదు. నీవు చెప్పాలి కాని కళ్ళనీళ్ళు పెట్టుకోవలసిన అవసరమేమొచ్చింది. 'శుభమా' అని అది వస్తే అప్పుడే ఏడ్పులు శాపనార్థాలున్నూ"

సుదర్శనం ముఖం కొంచెం నలుపు కారటం చూచింది లక్ష్మి.

"అది యింకా చిన్నదా! అయినా ఎవరెలా పోతే నాకేం. పెళ్ళాన్ని వెనకేసుకొని వచ్చాడులే. నాకన్న అదే ఎక్కువ వాడికి" అంటూ పిల్లవాడిని మంచంమీద పడుకోబెట్టి లోపలకు వెళ్ళిపోయింది నారాయణమ్మ ముక్కు పైకెగచీదుకుంటూ.

లక్ష్మి మనస్సు చచ్చిపోయినంత పనైంది. తనవల్లేకదా అత్తగారికి యింతకోపము. ఆవిడ అసలే మూర్ఖపుమనిషి. తను పట్టిన కుందేలుకు మూడేకాళ్ళనే రకం. సుదర్శనం కూడ అలా బయటకు వెళ్ళిపోయాడు. ఎవరేమి చేసినా చంటిపిల్లవాడి సంరక్షణ తనదే గనుక ఏడుస్తున్న చంటిపిల్లవాడిని బుజ్జగించింది లక్ష్మి.

పిల్లవాడికి పాలిచ్చి నిద్రబుచ్చి లోపలకు వెళ్లింది. నారాయణమ్మ ఏదో గొణుగుకుంటూ ఓమూల గోవిందనామములు పుస్తకాన్ని తిరగవేస్తుంది. లక్ష్మి బియ్యముతీసి తపాలలో పోసింది. అంతలో నారాయణమ్మ

"అప్పుడే చెయ్యిపెట్టావటే. నీవు ఏది పట్టుకున్నా అది భస్మమవటమే తప్ప ఏమీ మిగలదు. అయినా ఎప్పుడేనా వంట చేశావటె ఈ యింటిలో. నీ చేతితో ఎప్పుడేనా తిన్నానటె నన్ను నా ఆచారమంతటినీ, మా తాతల కాలం నుంచి వచ్చిన ఈ పుణ్యాన్ని అంతా పాడుచేస్తున్నావు."

"నే నేమన్నా వంటచేశా నేమిటండీ. బియ్యము పట్టుకొనేటంతలో మీ ఆచారాన్నంతటినీ పోగొట్టానా. అంత పెద్ద పెద్ద కేక లెందుకండీ" అని లక్ష్మి మెల్లగా అని అక్కడనుంచి పైపువద్దకు నీళ్ళ బిందె తీసుకొని వెళ్ళింది.

ఇలాగే రోజులు గడుస్తున్నయ్. అత్తా కోడళ్ళ ముఖాలు ముఖాముఖి కలుసుకున్నా, మాటలు పెళుసుగానే వస్తున్నయ్. సుదర్శనం లక్ష్మి పెట్టిన రెండు మెతుకులూ గొంతుకలో వేసుకొని వెళ్ళుతున్నాడు.

ఒకరోజున నారాయణమ్మ తమ్ముడు గోవిందం వచ్చాడు. అక్క నారాయణమ్మను తన కొడుకు పెళ్ళికి తీసుకపోదామని వచ్చాడు. చాలరోజుల కొచ్చినందువల్ల తమ్ముడిని పదిరోజు లుండమని బలవంతం చేసింది. ఈ పదిరోజులు అక్కడే వుండవచ్చునని మరునాడే ప్రయాణానికి సిద్ధము కమ్మన్నాడు గోవిందం. వచ్చిన రోజు రాత్రి భోజనాలయ్యాక తీరుబడిగా కూర్చున్నారు అక్కా తమ్ముళ్ళు. లక్ష్మికి పెళ్ళికి వెళ్లడానికి ఇష్టములేదు. అదీగాక సుదర్శనం కూడా, ఆఫీసులో ఇనస్పెక్షను వుండుటవల్ల, రాలేనని చెప్పాడు. అందుచేత ఇష్టమున్నా, లేకపోయినా లక్ష్మి ఉండవలసి వచ్చింది.

"అమ్మాయి ఏదక్కా? ఒకసారి పిలవ" మని అక్క నారాయణమ్మతో అనగా

"నీవే పిలవరా," అని నారాయణమ్మ ముఖము అటువైపు త్రిప్పి అంది.

అదిజూచి గోవిందం మళ్ళీ "నువ్వే పిలవ్వే" అన్నాడు.

"అది నేను పిలుస్తే రాదురా! నీవు పిలుస్తే పిలువు. లేకపోతే మానెయ్యి" అని కోపముతో అంది నారాయణమ్మ.

ఇంతలో లోపల పిల్లాడు కేరుకేరుమని ఏడుస్తున్నాడు. వినగానే నారాయణమ్మ లోపలకువెళ్లి చంటాడిని తీసుకొని ఎత్తుకుంది. వాడు ఎంతకూ ఏడుపు మానకపోవటం చూచి, తను వాడికోసం కొన్న బొమ్మలూ, అవీ తెచ్చి ఎదురుగా పెట్టింది. అయినా ఏడుపు మానలేదు.

"చూశావురా! పిల్లాడు ఇలా ఏడుస్తున్నా వినిపించుకొన్నదేమో! వాడి గొంతుక పగిలిపోతున్నా కొంచెము పాలు పొయ్యదు. కని వదిలిపెట్టేసింది. మొగుడుతో మాట్లాడుతూ కూర్చుంది. ఇదిరా వరుస"అని తమ్ముడుతో చెపుతున్నంతలో,

వేదాంతి:—

మనం ఒకింతగా దానం
చేస్తే, మరికొద్ది కాలానికే అది
మనకు రెండింతలుగా తిరి
గొస్తుంది.

శ్రోత:—

మీరు పలికింది అక్షరాలా
నిజమండీ! నేను గడచిన సంవ
త్సరములో నా కుమార్తెను
ఒకరికి కన్యాదానం చేశాను.
అప్పటికప్పుడే కూతురూ
అల్లుడూ యిద్దరూ వచ్చి
నాయింట కాపురం బెట్టారు.

—గోపిశ్రీ

"నే నేమి మాటలాడటం లేదు. వారికి భోజనము వడ్డిస్తూ వుండటమువల్ల ఆలస్యమయింది" అని లక్ష్మి పిల్లాడికోసం వచ్చింది.

"చాల్లేవే! ఊరుకోరా బాబూ! ఏడువకు" అని మనుమడిని భుజముమీద వేసుకొని త్రిప్పుతూవుంది.

అత్తలకు కోడళ్లకన్నా కోడళ్లకు పుట్టిన పిల్లలమీద మక్కువ ఎక్కువ. కోడలు చచ్చినా బ్రతికినా మనుమడు బాగుండాలి. ఇదీ వారి కోరిక.

"పాలిస్తాను. ఇలా యియ్యండి" అని లక్ష్మి చేతులు చాపింది.

"తీసుకో అమ్మా! తీసుకో!! నీయిష్టము వచ్చినట్లు చేసుకో" అని పిల్లవాడిని మంచముమీద పడుకోబెట్టింది.

ఇదంతా గోవిందం చూచాడు. ఇద్దరూ ముఖాలు చూసుకోకుండా మాట్లాడటము, పిల్లాడిని చేతి కివ్వకుండా మంచముమీద పడుకోబెట్టటమూ అంతా చూచాడు.

"అమ్మా! నీవు అబ్బాయి తప్పకుండా తమ్ముడి పెళ్ళికి రావాలి."

"వారికి ఆఫీసులో పనివుందిట. సెలవు ఇవ్వరట. అందుచేత వారితోపాటు నేనూ రావటానికి వీలులేదండి."

"అబ్బాయి ఈ నాలుగు రోజు లూ హోటలులోనైనా భోంచేస్తాడు. నీవు తప్పకుండా వచ్చి తమ్ముడి పెళ్ళి జరిపించాలి."

"అదేమిటి బాబాయిగారూ! నేను రాక

పోతే పెళ్ళి ఆగిపోతుందంటూరా? వారికి హోటలు భోజనము సరిపడదు ఆ సంగతి అత్తయ్యగారికికూడ తెలుసు" అని పిల్లాడిని తీసుకోని లోపలకు వెళ్ళింది సుదర్శనం ఏదో ఆఫీసుపని గదిలో కూర్చొని చూసు కుంటున్నాడు

"అబ్బాయిని కూడా అడగనేంటేఅక్కా" అని గోవిందం అడిగినదానికి

"వాడిని అడిగినా అదే చెప్పతాడు. పోనీ అడుగు" అని అక్క తమ్ముడికి పెడ సరపు సలహా చెప్పింది

సుదర్శనం కూడా అదే సమాధానం చెప్పాడు "మీ అమ్మయివస్తే తీసుక వెళ్ళండి నాకేమి అభ్యంతరంలేద"న్నాడు. కాని లక్ష్మి రానంది

"వా రెవ్వరూ రాకపోతే నేను రాను రా"

"మీ రెవ్వరూ రాకపోతే పెళ్ళే మానే స్తాను" అని గోవిందం నిరాశపూరితమైన స్వరంతో అనగా

"అదేంటిరా! అలా గంటావు! అటు వంటి మాటలు శుభమా అంటూ అనకురా" అని నారాయణమ్మ అంది

"నీ సంగతి అంతా నేను తెలుసుకు న్నాను. నువ్వు వాళ్ళను రమ్మంటే వస్తారు. నాగురించైనా, నీ మేనల్లుడు గురించైనా, అబ్బాయితో రమ్మనమని చెప్పు"

"వాళ్ళను బ్రతిమాలమంటా వేమిటిరా? నేను చస్తే వాళ్ళను రమ్మనమని అడుగను"

"అయితే నా సంచి ఇలా యివ్వండి" అని లేచి చొక్కా తొడుక్కోవటం చూచి,

"ఊరుకోరా! నామీద ఒట్టు నీవు వెళ్లావంటే" అని నారాయణమ్మ తమ్ముడిచేయి పట్టుకుంది.

"మీరు ముగ్గురూ పెళ్ళికి రాకపోతే నామీద ఒట్టు" అని గోవిందం సంచి తీసుకొని బయలుదేరాడు. నారాయణమ్మకు గట్టి చిక్కే వచ్చింది. తన మనస్సు కన్న కొడుకుతో మాట్లాడటానికే అంగీకరించడంలేదు. అటువంటప్పుడు కోడలును ఎలా బ్రతిమ లాడగలదు

ఎలా అయినా, ఎంత చెడినా కన్న కొడుకునే బ్రతిమాలుదామని బయలుదేరి కొడుకు గదిలోకి వచ్చి నుంచొంది సుద ర్శనం తల్లిరావటం చూచాడు కాని మాట్లాడలేదు ఎందుకు వచ్చిందో తెలుసు.

"నాయనా? నీకు తెలీంది ఏమీలేదు గదా! మామయ్య నీకోసం వచ్చాడు నిన్ను రమ్మనమని మామయ్య మరీమరీ బ్రాధేయపడుతున్నాడురా"

"నేను ముందే చెప్పేశాను. చెప్పవలసిందేదో నేను రావటానికి వల్లపడదు" అని సుదర్శనం కోపంతో అనగా

"పెద్దదాన్ని ఏదో చిన్నమాటన్నానని పంతం పట్టావు. నిన్ను కని చిన్నప్పటి నుంచి పెంచి పెద్దచేస్తే నామాట కొంచెం కూడా లెఖ్ఖలేదుగదా! నేను చేసిన తప్పేముందిరా! నీ కోపతాపాలకు నన్నే గురిచేయా లేమిటిరా! నా నాథుడు లేక పోబట్టి, నేను ఒంటరిదాన్నవబట్టి మీరందరూ ఇలా అంటున్నారు మీ నాన్నగారే వుంటే మీ రిలా అనగలిగే వారా? మీ లెఖ్ఖ కావలసి ఉండునురా" అని ఏడుస్తూ కొడుకు చేయి పట్టుకుంది.

తన తల్లి ముఖములోకి ఒకసారి చూచాడు సుదర్శనం కళ్ళవెంట నీళ్లు బొటబొటా కారుతున్నయ్ తల్లిచేయిపట్టు వదులయిపోతుంది కన్నతల్లితో సరీగా మాట్లాడక చాలరోజు లయింది. వెంటనే తనకు కూడా రెండు కళ్ళలోను నీరు నిండింది. తల్లి రెండు చేతులను పట్టుకొని

"నీ యిష్టము" అన్నాడు.

కళ్ళ నీళ్ళు తుడుచుకొని "శ్రేష్ఠ ప్రయాణం" అని నారాయణమ్మ అంటుండగా లక్ష్మి పిల్లవాడిని సుదర్శనానికి అదించింది వాడు బామ్మను చూడగానే చేతులు చాచాడు కొడుకు చేతిలోంచి మనుమడిని తీసుకొని బయటకు వెళ్ళి తమ్ముడికి యిచ్చింది నారాయణమ్మ

"ఇనస్పెక్షను ఏమయిందో" అని లక్ష్మి చిరునవ్వు నవ్వుతూ, వెక్కిరిస్తున్నట్లుగా చూచింది సుదర్శనంవైపు

"వాయిదా పడింది" అని లక్ష్మిని దగ్గరకు తీసుకున్నాడు స్టేషనులో లక్ష్మి నవ్విన నవ్వును ఒకసారి జ్ఞప్తికి తెచ్చుకు న్నాడు సుదర్శనం.





చంద్రగిరి రాజమందిరంలో-ముందువరండా-చంద్రగిరి.

ఫొటో - శ్రీ తుమ్మలపల్లి సత్యనారాయణమూర్తి (పిప్పర)

# ఈలోకం

[భారత్ క్లబ్ : ఒక టేబిలు వద్ద పేకాట. నాణెములు ఖణ ఖణ బల్లమీద పడుతూంటాయి.]

సత్యం : అర్ధ రూపాయి.

దాసు : నే నొక అర్ధ.

రంగయ్య : నేనూ అంతే.

స : రూపాయి.

దా : రూపాయి.

రం : ఇదిగో నాది.

స : ఇంకొకటి.

దా : ఊఁ...

రం : ఊఁ...

స : అయిదు

దా : అయిదు

రం : ముక్కలు చూసనియ్యి...... (చూసుకుని) నేను తగ్గాను.

స : అయిదు

దా : వంద రూపాయిల చిల్లరియ్యి సత్యం.

స: ఇదిగో...(నోట్లు లెక్కపెడతాడు)

దా : నేను పది:

స : ఇరవై.

దా : (పేక చూస్తున్నా)... నలభై.

స : నా నలభై.

దా : నలభై.

స : నలభై.

దా : సత్యం, ఒక వందియ్యి.

స : ఉన్నదంతా వేసేసి వస్తు తిప్పుతాను.

దా : వదే ఉంది. తిప్పుమనడానికైనా.

స : ఆ వదీ వెయ్యి......మిగతాది లెఖ కట్టుకుంటానులే.

దా : సరే. తిప్పు.

స : మూడాసులు. (డబ్బంతా తీస్తో తన ప్రక్కకు లాక్కుంటాడు)

రం: ఈపూట సత్యం నక్కను తొక్కొచ్చాడు. నాది అరవొందలు పోయింది.

దా : నేను పన్నెండొందలేసుకు వచ్చాను.

స : ఇవ్వాళ పొరపాటున ఎందుకో తెలికి ముక్కొక్కింది.

దా : కొర్డ్సు పంచు.

సత్యం : డబ్బయిపోయిం దన్నావు ?

దా : అయిపోయింది. ఓ వందియ్యి. రేపు చూసుకుందాము.

స : ఏం రంగయ్యా, నీదగ్గ రేమన్నా పిచ్చిక లింకా ఉన్నాయా ?

రం : లేవు భాయి. మనం సరిపుచ్చుకుంటాము.

స : (లేచి కుర్చీ వెనక్కి తోస్తాడు.)

దా : ఏం సత్యం లేస్తున్నావే ? నాలు గాట లెయ్యి.

స : నేను అరువు ఆడడం మానేశాను.

దా : నామీద నమ్మకంలేదా ?

స : నీమీదేగాదు. మనుష్యులమీదే పోయింది.

దా : చాల్లే వేదాంతం-ఫిలాసొఫీ.

స : లాభంలేదు దాసు.

దా : అంతమాత్రం మగాడివి పేకాట కెందుకొచ్చావు - ప్రజలసొమ్ము లేరగా వొల్లుకుపోదామని వచ్చావేం.

స : నోరుముయ్యి. మాట మిగిలావంటే పళ్ళూడిపోతయి.

దా : నీలాంటి లుచ్ఛాలతోటి ఆడడం నాదే బుద్ధితక్కువ.

స : ఎవడురా లుచ్ఛా! (దాసు చొక్కా పట్టుకుంటాడు.) మగసిరిగా గెల్చావురా.

**శ్రీ ప్రతాపరావు**

రం : సత్యం, చొక్కా వదులు-ఏమిటీ రభస.

స : ఓడిపోయి, ఉద్రేకంతో అప్రాచ్యపు వాగుడు వాగుతావురా అప్రయోజకుడా. నీ బ్రతుక్కి తోడు పేకాట కూడానా!

దా : ఆట్టే పేలకు. దవడలు తిన్నగా ఉండవు.

రం : (గద్దిస్తూ) ఆఁ!...సత్యం, రా పోదాం.

స : (రంగయ్య మాటలు వినకుండానే) నోరు మెదిపావంటే తంతాను. దొంగనాకొడుకా.

రం : (విసుగుతో) చివరకు కాడీ మాకలా తయారయ్యారు. ఇంత నాము పాలు ముంచిపడుతూంటే పేకా డెవడాడ మన్నాడు మిమ్మల్ని. పదండి: సత్యం పద పోదాం కాంటీన్కి.

సత్యం : (దారిలో) వాడి తెడు తెడు వెధవ. కొమ్ములు తిరిగి మాట్లాడుతోంటే.

రం : వాడు కుర్రాడు. వాడితో సమాన స్థాయిగా నువ్వు దెబ్బలాడితే ఎలా! నీ కింత వయస్సు, అనుభవం ఉండి ఏమి ఫలం.

స: చిన్నా పెద్దా గమనించక్కర్లే. ఇట్లాంటి చచ్చు దద్దమ్మల్ని లక్షలు చూశాను. అప్పివ్వడం నా కిష్టంలేదు. మానేశాను. దానికింత రాద్ధాంతం జేస్తాడా వాడు!

రం : అంతవరకూ బాగానే వుంది గాని, నే నొక్క చిన్న విషయం అడుగుతా చెప్పు.

స : అడుగు.

రం : ఈ ఆటలో ఇచ్చిపుచ్చుకోడాలు మామూలేగా. నీ కెందు కభ్యంతరం?

స : నా కిష్టం లేదు. అంతే!

రం : రైటే. కాని దానికో కారణం ఉండాలిగా......ఏయ్ బాయ్, రెండు కాఫీ తీసుకురా..... ఏం, మాట్లాడవేం.

స : ఏం మాట్లాడను! అనుభవం నేర్పిన గుణపాఠం అది.

రం : ఏం ఎక్కడన్నా దెబ్బతిన్నావా?

స : ఒక్క చోటా! అడుగడుగునా, మనిషి మనిషిలోనూ, కుచ్ఛితం, అన్యాయం, స్వార్థపరత్వం ఈ మనుష్యుల్లో అణువణువునా జీర్ణించిపోయుంది. ఎదుట తనవాడు ఆకలితో అటమటించి అంగలార్చుస్తూ అంతిమశ్వాసం వదలుతూన్నా చలనం కలగని పాషాణాలు వీళ్ళంతా.

బోయ్ : కాఫీ సార్.

రం : ఇక్కడ పెట్టు.

స : ఉద్రేకంలో ఏమేమిటో మాట్లాడేశాను. అవేమీ పట్టించుకోకు. కాఫీ కానియ్యి.

రం : అలాగే...సత్యం, నీ అనుభవం తెలుసుకోదగ్గదే. తప్పకుండా చెప్పాలి.

స : అదంతా ఒక పెద్దకథ. వినడం చాలా కష్టం. వినలేవు, విసుగెత్తుతుంది. దయార్ద్ర హృదయుడవైతే మనసు కలచివేస్తుంది. విషాదమయిన వికృత సంఘటనలవి. వికటంగా వెగటుగా వినబడతాయి.

రం : అయితే తప్పకుండా వింటాను.

స : అన్నంత తేలికగాదు. అలాంటి అత్యాచారాలు నువ్వు చేసుంటావు. నీతోబాటు ఈ వినబోయేవాళ్ళంతా భుజాలు తడుముకోవాల్సొస్తుంది. ఎందుకపోనియ్యి.

రం: ఏమయినా సరే. నువ్వు చెప్పి తీరాలి.

స. కానియ్యి, బలవంతపు బ్రాహ్మణార్థం. కాదంటే ఎలా?

రం: కృష్ణ ఒడ్డుకు పోదాం పద.

స నీయిష్టం.

రం: కాఫీ పూర్తయిందా?

స: ఆ,

రం: పద పోదాం.. .. ...

రం: (దారివెంట) ఊఁ మొదలు పెట్టు. చెప్పుకుంటూ పోదాం.

స: అలాగే. పదేళ్ళనాడు......... పచ్చని సంసారం నాది. నిశ్చింతగా, నిర్భయంగా, పెరిగిన నెగ్గుతూండే కుటుంబం నాది.

*       *       *

కమల: ఏమండీ, పట్నం డబ్బు పంపించారా అబ్బాయికి?

సత్యం: ఇదిగో, ఇప్పుడేగా పంట తాలూకు బాకీ పెదకాపు వచ్చి యిచ్చి వెళ్ళాడు మధ్యాహ్నం పంపిస్తాను.

కమల ఈ డబ్బుదాకా కూర్చున్నారా! ఇదివరకిచ్చిన పంట డబ్బేమైంది?

సత్యం రామయ్యకు చేబదులు కావాలంటే యిచ్చాను

కమల: బాగా నేఉంది వాడే మోఉత్తరాల మీద ఉత్తరాలు రాస్తున్నాడు పరీక్షలకు డబ్బు కట్టాలని మీరు చేబదుళ్ళిస్తుండండి.

స ఆపదలో ఆదుకోని ఆత్మీయులుండేం ప్రయోజనం? రామయ్య మాత్రం ఎప్పుడూ అడుగుతాడా? కలకాలం వస్తాయా కష్టాలు? అత్యవసరమంటే, సరే పట్టు కెళ్ళమన్నాను

కమల: ఏదో వాళ్ళకేఅవసరమున్నట్టు, మనకు లేనట్టు బాగానే ఉంది.

స: అబ్బాయి పరీక్షల కింకా గడువుందని యిచ్చాను ఇంకా రెండు రోజుల దాకా మనవాడు జీతాలుకట్టవచ్చు. ఈ పూట పంపేస్తాను రేపు చెల్లించేస్తాడు. ఇదేం బ్రహ్మ ప్రళయమా.

కమల నేను ఏం మొత్తుకుంటే ఏం లాభం? మీ పని మీరు మానరు. సరే కానీయండి.

సత్యం: నువ్వేం విచారపడకు, దివ్యంగా వెళ్ళిపోతయిమన రోజులు అబ్బాయి ఈ సంవత్సరంతో డిగ్రీ పుచ్చుకొంటాడు. వాడిపొట్ట వాడుపోసుకుంటాడు. వచ్చే యేడు పెద్దమ్మాయికి పెళ్ళి చేస్తే దాని దారిన అది పోతుంది యిక మిగిలేది నా బంగారుతల్లి లక్ష్మేనా! పువ్వుల్లో పెట్టి పెంచుతా

క. మీరిట్లాగే చెప్తుండండి, పెంచుదురు గాని.

స: చూస్తావుండు—లక్ష్మి. ....చిట్టితల్లీ. ...

లక్ష్మి: ఆ వస్తున్నా నాన్నా.

స. రా, అమ్మ. రా..

"బంగారు పాపాయి
బహుమతులు పొందాలి,
పాపాయి చదవాలి
మా మంచి చదువు."

లక్ష్మి: నువ్వెప్పుడూ యింతే నాన్నా. సిల్కు గౌను, పట్నం గాజులు తెస్తానన్నావు... తేలేదుగా.

సత్యం ఓస్ అవా! వస్తున్నయిగా, నీకు తెలవదేమిటి, - ఈ ఊళ్ళో మంచివి దొరకవు అన్నయ్యని పట్నంనుంచి పంపించమని వ్రాశానుగా...

ల: ఇవ్వాళొస్తాయా నాన్నా.

స: ఊఁ పోస్టుమేన్ ఇంత పెద్దపార్శిలు తీసుకొస్తాడు, ఇవ్వాళో రేపో, అది నీకనుకో.

క: ఊఁ. చాల్లెద్దురూ.

ల. ఏఁ అమ్మ, రావా,

క: మీ నాన్ననే అడుగమ్మ.

# బెంగాలీ మహనీయుడు

ఈ బెంగాలీ మహనీయుడు సాహిత్య లలిత కళారంగాలలో మహోన్నత ఖ్యాతిగాంచిన మేధావులు పలువురు ఉద్భవిల్లుచున్న వర్గమునకు చెందినవాడు. బహుళా కష్ట పరంపరల అనుభవముచే మానవుని ఆధ్యాత్మిక, మానసిక శక్తులు సాత్విక మౌతాయనడం యథార్థమే కావచ్చు, జనాభా విపరీతంగా పెరిగిపోయిన ఇతని రాష్ట్రం అనేక శతాబ్దాలుగా దండ యాత్రలకు, వరదలకు, క్షామానికి, విషవ్యాధులకు, గురియైనది. ఏదో ఒక రూపంలో కష్టములు లేకుండా, ఒక సంవత్సరమైనా గడవలేదు. 1769లోని కరువులో కోటి మందికి పైగా మరణించినట్లు మనకు చెప్పుచున్నారు. పరిపాలనా వ్యవహారాలు బాగా కుదుటబడిన మీదట, అధికారులు బెంగాలీలను ఇట్టి కష్ట పరంపరలనుండి కాపాడుటకు చాలా కృషి చేశారు కానీ, వారు ప్రకృతి తత్వముల వశ పరచుకోలేరు. దీనికి ఇటీవలి చరిత్రాంశాలే ప్రబల నిదర్శనం, ఇన్ని కష్టనష్టాలు వారిని ఎదుర్కొంటున్నా— వీటిమూలంగా నే ఈబెంగాలీలు గొప్ప విద్యా వంతులయ్యారు.



ఇండియాలో
మూరు మూలలలోను నివసించెడి వివిధ వర్గాలతో నిరంతర సన్నిహిత సంబంధాన్ని మేము ఏర్పరచు కున్నాము. వారు తమకు కావలసిన పెట్రోలియం ప్రాడక్టులకు మాపై ఆధార పడుతున్నారు గనుక, మేము కూడా వారికి సేవ చేయడము గొప్పగా భావిస్తున్నాము

బర్మా - షెల..

భారత జీవితంలో ముఖ్య భాగమై యున్నది

అ: ఏం నాన్నా, అంతా ఉత్తిదా? అమ్మ అట్లా అంటున్నది?

స: ఛ ఛ! మీ అమ్మకి ఏమీ కొనిపెట్ట లేదని అట్లా అంటుంది "ముందు లక్ష్మికి. తరువాత నీకు" అని అమ్మతో చెప్పాను. అందుకని అట్లా అంటుంది

ల: పోనీలే నాన్న, అమ్మకు కూడా కొనిపెట్టు

స: నువ్వు కొనిపెట్టమంటే సరే నమ్మ. ఏమేవ్, కోరుకో నీయిష్టం వచ్చింది నా చిట్టితల్లి ఆజ్ఞ అయింది.

లక్ష్మి: అడగవే అమ్మా!

క: అయ్యోరాత. పిచ్చిపిల్లవు. నువ్వు పోయి ఆడుకో

ల: ఏం నాన్నా, ఇదంతా అబద్ధమా!

స: అమ్మ అంతేలే నేను దానికి అందుకే కొనిపెట్టనన్నాను.

[బయటనుంచి "సత్యంగారూ" అని కేక.]

క: ఆపద్బాంధవుణ్ణి ఎవరో ప్రార్థిస్తున్నారు వెళ్ళండి

స: ఏం కాక! మీ నాన్నకు మళ్లీ అనుకున్నావా?

క: మా నాన్నెందుకు లెండి మన్యా. (కేక వినిపిస్తుంది) మళ్ళీ కేకేస్తున్నాడు వెళ్ళండి.

స: ఆఁ వస్తున్నా.

నారా: నమస్కారం సత్యంగారూ.

స: నమస్కారం, రా, నారాయణా... ఆదేమిటి అలా ఉన్నావు.

నారా: ఏం చెప్పమంటారు!

స: తరవాలేదు చెప్పు

నారా: మా తమ్ముడు నెల్లూరులో పోస్టాఫీసులో పనిచేస్తున్నాడు.

స: అవును ఇదివరకు చెప్పావు

నారా: వాడొక ఇన్స్యూర్డు కవరొకటి పారేశాడట.

స: అరే! ఎలా పోయింది?

నా: ఆ వివరాలు తెలియలేదు.

స: ఆకవరెంతకు ఇన్స్యూర్ చేశారట!

నా: అయిదువందలకు.

స: నీకీ విషయం ఎలా తెలిసింది!

నా: మావాడు టెలిగ్రాము యిచ్చాడు. ఈ సాయంత్రంలోగా అయిదు వందలూ కట్టకపోతే అరెస్టుచేస్తారట. అదయినా పార్టీని బతిమాలుకొని ఒప్పించాలి.

స: అరె పాపం!

నా: అందరినీ అడిగాను. రెండువందల రూపాయల దాకా సంపాదించాను మిగతాది పూడే మార్గం కనబడడంలేదు.

స: సంజీవరావుని అడిగావా?

నారా: అడిగాను. లాభం లేకపోయింది.

స. మీ ఇంజనీ రేమయినా సహాయ పడేవాడేమో!

నారా: అయన్నే కాదు. ఎందరో్న అడగకూడనివాళ్లను కూడ అడిగాను. ఫలితం లేకపోయింది. చివరకు మీమీద ఆశపెట్టుకున్నాను నా కుటుంబగౌరవము యిప్పుడు మీ చేతుల్లో ఉంది.

స: సమయానికి చేతులో పైకంలేకుండా వచ్చింది ఇలాటప్పుడు ఆదుకోకపోతే ఎందుకు?

నారా: ఈ సమయంలో మీరు కాపాడకపోతే నేను యింక.. (ఏడుస్తాడు)

స: ఛ, కంటనీ రెట్టుకుంటా వెందుకు, పిచ్చివాడా

నారా: (గాద్గదికంగా) ఈ సంగతి విన్నప్పట్నుంచి మా అమ్మ ఏడుస్తూ కూర్చుంది ఇంట్లో ఎవరికీ తిండీ తిప్పలూ లేవు.. .. ....

స: (మాట్లాడడు)

నారా: మీరు కలగజేసుకోకపోతే జీవితంలో యిక తలెత్తుకు తిరగలేను. మీదగ్గర లేకపోయినా, ఎక్కణ్ణుంచయినా తెచ్చి నన్నీ ఆపదనుండి రక్షించాలి.

స: మా అబ్బాయి పరీక్షలకు డబ్బు కట్టడానికి యివ్వాళే ఆఖరు రోజు. ఎనభై రూపాయ లున్నయి. నువ్వింక కొంచెం ఆలస్యంగా వచ్చిఉంటే ఇదయినా దొరికేది కాదు. ప్రస్తుతానికి నే చేయదగ్గ సహాయం అదే.

నా: మిగతాది ఎలా పూర్తవుతుంది?

స: నువ్వు ఇంకెక్కడయినా తంటాలు పడు. నే నిచ్చిన ఎనభై రూపాయలు ఒక వారంలోపల ఎలాగయినా తిరిగివ్వాలి.

నా: తప్పకుండా యిస్తాను. ప్రావిడెంటు ఫండ్‌లో అప్పుకు దరఖాస్తు పెట్టాను.

స: నువ్వేమయినా చెయ్యి. ఒక వారం లోపల, ఎంత ముందుగా వీలయితే అంత త్వరగా పైకం తిరిగిచ్చెయ్యి

నా: మీరంత మరీ మరీ చెప్పవలసిన అగత్య మేముంది? సరే సెలవు తీసుకుంటాను.

స: సెలవు.

*　　*　　*

క: ఏమండీ, పెద్దబ్బాయి డబ్బు

"ఒక బొద్దింక ఏడాదికి 43,000 పిల్లలనిపెట్టగలదు..." క్లాసులో మాస్టారు పాఠం చెప్పుకుపోతున్నారు.

"అరేబాప్'... ఇంకానయం. అవే గనక పెళ్ళిళ్లు చేసుకొంటే చచ్చేపోతాం!" అన్నాడు వెనుక బెంచీలో కూర్చున్న ఒక కుర్రాడు మరొక కుర్రాడితో.

యిచ్చేశారు గదా, వాడి పరీక్ష ఫీజు సంగతేం చేశారు

స: లేటు ఫీజుతో సపోకట్టాను. ఇంకో అయిదు రూపాయల భాగ్యం. అంతేనా! నారాయణ తమ్ముడు జైలుకు వెళ్ళకుండా తప్పించ గలిగాను

క: ఆపద్బాంధవులని నామం సార్థకం చేసుకుంటున్నారన్న మాట.

స. ఈనాడు మనం వాళ్ల ఆపదలలో ఆదుకుంటే, ఏనాడైనా మనని ఆదుకోవాలనే కృతజ్ఞత వాళ్లకుండకపోతుందా!

క: సరే మీ యిష్టం వచ్చినట్టే కానియ్యండి.

*　　*　　*

క: ఏమండీ, చిన్ని లక్ష్మి మాట్లాడడంలేదు. మీరు బయటికెళ్ళిం దగ్గర్నుంచి వళ్లంతా బిగిసిపోయినట్టుంది. అప్పుడప్పుడు కళ్ళు తెరుస్తోంది. కాని తెరలు తెరలుగా వస్తోంది మగత. త్వరగా డాక్టరు దగ్గరి కెళ్ళిరండి.

స: వెళ్ళాను. జ్వరతీవ్రత యిలా వొస్తుందని కూడా చెప్పాడు. టైఫాయిడ్ జ్వరమట.

క: టైఫాయిడా! అమ్మో!...(ఏడుస్తుంది) త్వరగావెళ్ళి డాక్టరును తీసుకురండి

స: వెళ్ళినా ప్రయోజనంలేదు! ఏదో ఒక కొత్తమందొచ్చిందట. బుడ్డి యాభై రూపాయలు. ఆ మందు రెండు సీసాలు కొని వాడమన్నాడు. అది వాడితేనే లక్ష్మి మనకు దక్కుతుంది.

క: కొని తీసుకరాకపోయారా,

స: ... (మాట్లాడడు)

క: మాట్లాడరేమండీ, త్వరగా వెళ్ళి

(58-వ పేజీ చూడండి)

# విముక్తి

ఒక పీడాదినుంచి కొత్తసూటు కుట్టించుకుందామని ప్రయత్నిస్తూ వుంటే ఇన్నాళ్ళకి వీలయేలా కనిపించింది. ఒక సూటుకోసం ఇంత ప్రయత్న మెందుకయ్యా? అని మీ రడగవచ్చు. దానికి కారణం విన్నవించుకుంటున్నా!

నాన్నగారిది చాల మెత్తని హృదయం. ఇంటికి ఎవరైనా అతిథి వస్తే దేవుడు పంపిన దూత అని అతి మర్యాదచేసి చాల గౌరవంగా అన్నీ నడిపించేవారు. అమ్మ కూడా పతివ్రతా శిరోమణి కనుక ఎదురు చెప్పక ఆయన, అడుగుజాడల్లో నడిచేది. కాని ఈ అతిమర్యాదవల్ల మా ఇంటికి ప్రతి నెలా ఎవరో ఒకరు వచ్చి మకాం చేసి వెడుతూవుండేవారు. అందువల్ల మా ఇంట్లో చాల ఇబ్బందిగా వుండేది. అప్పులు కాకుండా వుండేటందుకు ఒక్కొక్కళ్ళం ఒక్కొక్కటి మానెయ్యవలసివచ్చేది. అప్పటికీ చాల కష్టంగానే నెలాఖరయ్యేది. పైకి ఏమీ అనకపోయినా, ఎంత పొదుపుచేసినా ఒక్కలాగే వుందన్ని అమ్మకి విసుగ్గానే వుంది.

ఇల్లు దూరంగా మార్చి, ఇరుకుగావున్న ఇల్లు తీసుకుంటే, ఇల్లు తెలియక కొంత మంది, ఇరుకు భరించలేక కొంతమంది రావడం మానేస్తారని, అదికాక అద్దెలో మాకు కొంత కలిసివస్తుందని ఆలోచించి ఊరికి చివర 20 రూ/ ఒక చిన్న యిల్లు పుచ్చుకున్నాం. కాని మా చుట్టాలకి మా మీద దయ తప్పలేదు. ఇల్లు ఏదోవిధంగా కనుక్కొని మాతోపాటే వాళ్ళూ అవస్థ పడుతూ ఆ చిన్న ఇంట్లోనే మకాంవేస్తూ వచ్చారు.

ఆ రోజు ఉదయమే ఒక బెడ్డింగు, పెద్ద పెట్టి, మరచెంబుతో శివశంకరంగారు దిగారు. మా గుండెలు గుభేలుమన్నాయి. ఆయన మా నాన్నగారి పెత్తండ్రి కొడుకు పెళ్ళాం మేనమామ అల్లుడు. ఆయన సామాను చూసి చాలకాలం వుండేలా వున్నాడని ఊహించుకున్నాం.

"త్రిపుర"

ఆయన వచ్చి నెల అయినా ఆయన కదిలేలా మాకు కనిపించలేదు. మమ్మల్ని జలగలా పట్టుకున్నాడు. ఈయన్ని వదుల్చుకుందుకు ఎన్ని ఉపాయా లాలోచించినా లాభం కనిపించలేదు. ఆయన కుర్చీలో గుండుసూదులు పెట్టాము. చాల శాంతంగా అవి భరించాడు. ఆయనకి ముక్కుపొడుం, కళ్ళద్దాలు లేకపోతే గడిచేది కాదు. వాటితో ఆయన దాగుడుమూతలు ఆడేలా చేసేవాళ్ళం. కాని ఆయన చిన్నపిల్లల కన్నా ఎక్కువ ఉత్సాహంగా అవి వెతుక్కునేవాడు.

ఆయన కాఫీలో కొంచెం కారం కలిపేవాళ్ళం. ఆవేళ మరీ బాగుందని యింకో గ్లాసు ఎక్కువ తాగేవాడు. కుర్చీలో కత్తి తీసేసేవాళ్ళం. అది హాస్యంగా తీసుకు ముందు తనే నవ్వేవాడు.

మేము నిరాశ చేసుకుని దిగాలు పడిపోయాం. మా తమ్ముడు (B. A. ఎకానామిక్సు) తన ఎకనామిక్సు తెలివినంతా ఉపయోగించి ఆయనతో సంభాషణలోకి దిగాడు.

తమ్ముడు: శంకరంగారూ! మన హిందూదేశపు ఆర్థికపరిస్థితి చాల హీనంగా వుందండీ.

శంక: అవునోయి, ప్రసాద్! ఫైవియర్ ప్లాను వేశారుగా పరిస్థితి బాగుపడవచ్చు!

ప్రసా: ఏమో! మధ్య తరగతి వాళ్ళు బాగా నలిగి నుసి అయిపోతున్నారు.

శంక: అవును వాళ్ళ పరిస్థితి చాల దుర్భ హీనంగానే వుంది. వాళ్ళే ½ జనాభా కూడాను.

ప్రసా: వాళ్లే కుటుంబ పోషణే వాళ్ళు జరుపుకోలేక బాధపడుతున్నారు. కట్టుకుందుకు గుడ్డ కొనుక్కోలేరు. కొంతమంది నెల పూర్తిగా తిండి కూడా తినలేరు.

శంక: చాల విచారించవలసిన విషయం.

ప్రసా: ఒక్కమనిషిని భరించడమన్నా చాల కష్టంగా వుంటోంది.

శం: నిజమే! ఇవన్నీ తెలిసినవాడివీ, తెలివైనవాడివీ కనుక చదువు పూర్తిచేసి వెంటనే ఉద్యోగంలోచేరి మీ నాన్నగారికి ఆర్థికంగా సహాయం చెయ్యడానికి ప్రయత్నించు. ఆయన రెండుమాటల్లో తేల్చేశాడు. మావాడి గొంతుకలో పచ్చి వెలక్కాయ పడింది. గుటకలు మింగుతూ లోపలికి వచ్చేశాడు. వాడిని చూసేపరికి

---

ఆడపిల్లల కాలేజీ హాస్టల్లో ఒకనాటి రాత్రి వినిపించిన ఒక సంభాషణ.

"సుశీ, సుందరీ! మీరిద్దరూ రేపు కాలేజి నాటకంలో వేషాలు వెయ్యబోతున్నారు కదా! ఎవరి పోర్షన్ ఎక్కువ కష్టమే?"

"నాదేనే!"

"నాదేనే!"

"ఏం? ఎందుచేత?"

"సుందరి పెళ్లికాని పిల్ల వేషం వెయ్యబోతోంది. నేనేమో, యిల్లాలి వేషం వెయ్యబోతున్నాను. పెళ్లిలేని పిల్లగా వుండటం కష్టమో, ఒకడి యిల్లాలిగా బ్రతకటం కష్టమో నువ్వే చెప్పవే, సుబ్బులూ!"



శంకరంగారూ! మన హిందూదేశపు ఆర్థికపరిస్థితి చాల హీనంగా వుందండీ......

అవునోయ్ ప్రసాద్ ఫైవియర్ ప్లానువేశారుగా పరిస్థితి, బాగు పడవచ్చు!

ఆపుకున్న నవ్వు ఒక్కసారి వచ్చేసింది మా కందరికి వాడు కందగడ్డలా అయి వీధిలోకి వెళ్ళిపోయాడు కోపంతో.

మా నాన్నగారికి డబ్బువత్తిడి బాగా వున్నా పైకి చాల గంభీరంగా నేవున్నారు ఆయన గౌరవ, మర్యాదలకి లోపం లేకుండా ప్రవర్తిస్తున్నారు. కాని ఇంక ఆయన్ని వదలకూడదని నిశ్చయించుకున్నాము.

ఆరాత్రి భోజనాలయాక అందరం సమావేశమై పడుకున్న నాన్నగారిని లేపి తీసుకు వచ్చాం నాన్నగారు వచ్చి మెదలకుండా మా మాటలువింటూ కూర్చున్నారు అందరం తీవ్రంగా ఆలోచిస్తూ కొంతసేపు కూర్చున్నాం. మా చిన్నతమ్ముడు ఆయన కూరల్లో ఉప్పు ఎక్కువ వెయ్యమన్నాడు అమ్మ ఆయనకి తెలియకుండా ఇల్లు మార్చేయాలంది. మా చెల్లెలు ఆయన బట్టలు దాచేయమంది. నేను "ఒక చక్కని ఉపాయం ...." అన్నాను. "ఏమిటి" అని అయిదు కంఠాలు ఆశగా అరిచాయి నేను ఠీవిగా నవ్వుతూ వాళ్ళవైపుచూసి తల వూపుతూ చూర్చున్నాను అందరూ "హు!" అని నిరాశగా ఊరుకున్నారు నా ప్లానుమీద వాళ్ళకి నమ్మకంలేదు. "సరే రేపు ప్రొద్దున ఆరు అయేసరికి ఆయన వెళ్ళిపోతాడు"అన్నా. అందరూ"చూద్దాంగా!"అన్నట్లు నావైపు చూసివెళ్ళిపోయారు" మర్నాడు అందరూ 4 గంటలకే లేచి ఎదురుచూస్తూ కూర్చున్నారు '7' అయింది. అందరూ ఆయన గదిలోకి తొంగిచూశారు. మామూలుగా '5' కే లేచి కాఫీకి తయారయే ఆయన గట్టిగా ముసుగుతన్ని గుఱ్ఱు తీస్తున్నాడు అందరూ నావైపు హేళనగా చూసి నవ్వేశారు. మా తమ్ముడు "అయిందినీ ప్లాను మహాత్యం" అన్నట్టు చూశాడు.

నేను ఏమిచెయ్యటమో తోచక దిగాలుగా చేతులు నులుపుకుంటూ కూర్చున్నా. '8' అయింది ఆయన రాలేదు మాతమ్ముడు రహస్యంగా నేను విషమిచ్చానేమో అని అడిగాడు అటువంటి పిచ్చిభయాలు అక్కరలేదని అభయహస్త మిచ్చాను. ఇంతలో గదిలో సందడి వినిపించింది

ఆయన నోటికి రుమాలు అడ్డుపెట్టుకుని తన సామాను సర్దుకుంటున్నాడు ఇంకో నిమిషానికి ఆయన గబగబా వెళ్ళిపోయాడు. మర్నాడు మాకు ఉత్తరం వచ్చింది. దాని సారాంశం ఇది! మమ్మల్ని వంశపారంపరా తిట్టాడు. మాయింటికి ఇకముందు ఎవరూ రాకుండా జేస్తూ వున్నాడని, అలాగ ప్రతిజ్ఞ బూనాడని ఉంది ఆయన తిట్లు దీవనలుగా భావించి, ప్రతినకి నమస్కృతులు అర్పించాం.

అప్పుడు మావాళ్ళు నన్ను చుట్టుముట్టి ఏంచేశానో చెప్పమన్నారు నాకప్పుడు యుద్ధంలో దిగ్విజయం పొందినంత గర్వంగావుంది ఠీవిగా కమేన్డర్ ఇన్ - చీఫ్ లా అలమారు దగ్గిరికి వెళ్ళి శంకరంగారి కట్టుడు పళ్ళవరసలు తెచ్చిచూపాను. అందరూ పొట్ట చెక్కలయేలా నవ్వేరు. ఏమైనా అంతటితో నా ధర్మమా అని, శంకరంగారి ధర్మమా అని మాయింటికి అతిథి సత్కారాలు తక్కువయేలా కన్పిస్తున్నాయి కనుక ఆరోజు క్షీరాన్నంతో సహా సంతృప్తిగా భోంచేశాం ఆరోజంతా మావాళ్ళు నన్నో హీరోలా చూశారు

ఆ రోజు మొదలు ఎవరెవరికి ఏమి ముఖ్యంగా కావాలో లిస్టు వేస్తున్నారు. నేను మాటు కావాలి అని వేశాను ★

(గతసంచిక తరువాయి)

## 20

అష్టమినాటి వెన్నెల మసగ్గావుంది. చంద్రుని చుట్టూచేరిన తెల్లని పొగ మంచులాంటి మేఘాలు చెదరిపోతున్నాయి. ఉండిఉండి ఉప్పుటేటి పక్రపైనుండి చల్లని గాలికెరటాలు దుర్గంధాన్ని మోసుకొస్తున్నాయి రోడ్డు ప్రక్కన కాలవగట్టుకు దగ్గరగా చింతచెట్టు వుంది. ఆ చెట్టుకు ప్రక్కనే ఎలక్ట్రిక్ స్తంభం కున్న దీపం వెలుగుతోంది. నూరమ్మ వ్యాపారం చూసుకోడానికి ఆ స్తంభానికి ఆనుకుని నిల్చుంది ఆ దీప కాంతిలో ముఖంమీద పౌడరు మెరుస్తోంది అప్పుడప్పుడు జుంకాలు వయ్యారంగ ఆడుతున్నాయి. ఖారాఖిల్లీరంగు పెదాలను బాగా యెరుపుచేసింది.

మద్రాసునుంచి వచ్చే మెయిలుబండి యీవేళ మూడు గంటలపైగా ఆలస్యంగా వచ్చింది. ఆ త్రోవనే రైలు దిగినజనం వైపుచూస్తూ కొస్త సర్దుకుని నిల్చుంది. జట్కాలు, రిక్షాలు, సైకిలు రిక్షాలు, నడచిపోయే మనుష్యుల్లో చూచేవాళ్లామె వైపు చూస్తున్నారు. నవ్వుకున్నవాళ్లు నవ్వుకున్నారు. అంతదూరం పోయేక వూసేవారు వూస్తున్నారు. నూరి తన వయ్యారం మాత్రం వలకబొయ్యటం మానలేదు. అప్పుడప్పుడు కులాసాగా కూనిరాగం తీస్తోంది

ముందు స్తంభం దగ్గర దీపం వెల్తురులో సైకిలు రిక్షాపై వస్తున్న భద్రాన్ని ప్రక్కనున్న రాముల్ని పోల్చిచప్పున చింతచెట్టు చాటున దాగుంది. భద్రం అక్కడే రిక్షా ఆపించాడు. రాములు దిగి దండంపెట్టి కాలవగట్టున పరుగెత్తాడు. రిక్షాకదులుతోంటే నూరమ్మ వెంటబడింది. పదడుగులు వేశాక, "బాబు, బాబు" అని కేక వేస్తూ పరుగెత్తి రిక్షానుపట్టుకుని ఆత్రుతగా అంది.

"బాబూ! బాలమ్మ అరజంటుగా రమ్మన్నాది బాబూ! సాలా మాటాడాలట! దిగండి బాబూ!"

భద్రం ఎగాదిగా ఒకసారిచూసి ముఖం త్రిప్పివేశాడు. "సాను సచ్చినట్టు బాబూ! నిబ్బగా రమ్మన్నాది—మీ నాన్నగారు పోనారు కదా! సాలకబుర్లు సెప్పాలట!"

ఈ నిర్శనంతో భద్రం రెండో వేపునుండి రిక్షాదిగాడు. "ఎంతసేపవుతాందో—ఆడికి డబ్బులిచ్చి పంపండి" అంది నూరి. డబ్బిస్తూ, "సరే! నువ్వుముందు నడు నేను వస్తా" నన్నాడు.

"ఆ కాలవగట్టున కంగాలుండి. నన్ను దగ్గరుండి తీసుకరమ్మన్నాది" సంశయిస్తున్న భద్రంవేపు చూచి అంది. "నడండి బాబూ! నానూ మనిషినే!"

భద్రం మాట్లాడలేదు చిరాకుగా వున్నాడని నూరి గుర్తించి నడుస్తూనే, సిగ్గునభినయిస్తూ, ఉబ్బిన వక్షాన్ని భద్రంకి స్ఫుటంగా కనిపించేటట్లు వదలి తన వేపు చూడకండా నడుస్తోంది. ఉండిఉండి ఒక్కొక్క చూపు విసరి సిగ్గును అభినయిస్తోంది.

భద్రంరోడ్డుమీద దీపం వెలుతురుమీద పడకండా వుండాలని కాలవగట్టుమీదకి గబగబ నడిచాడు. నూరి చప్పునదరిచేరి, "మేడల్లోవున్న బాబులు యీకంపులో అడుగడుతున్నారు! మీ రెంత మంచి బాబులు కాకపోతే మాలాంటోల ముకాలు సూత్తారు ఇలారండి బాబు! యీ బురద గట్టి పడినది!" అంటూముందు నడిచి త్రోవ చూపిస్తోంది. ఆయన్ని తప్పించుకుని వెళ్తూ భద్రం భుజానికి వక్షోజాలను పొరపాటున తగిలినట్లుగా తగిలించి ముందుకు తూలిపోతున్నట్లు నటించింది. "సెమించండి బాబూ! సిన్నగట్టు—రండిరండి!"

భద్రం కదలక ఆగాడు. పెరటిత్రోవగుండా ఆమె గుడిసెలోనికి తీసుకువెళ్ళటకు ప్రయత్నిస్తున్న నూరి వెనుకకువస్తూ, "బాబూ! యీ కంపులో రాడానికి సాల సెరువుతున్నారు. మాపూరి మనుసుల మనేసా యిటుకెట్టురాండి! పొలిగీలుతో యీకండలు పెరగకపోయినా వయసు యీకండలను పెంచినాదని తాతసెప్పినాడు!"

ఆ తాత కర్రపట్టుకుని ఒకచేతదాకతో గబగబనడుస్తూ రావటం నూరి యీమాటల్లో గుర్తించలేదు. నూరి తాతను చూడగానే చప్పున పూరుకుంది. నూరి గొంతుకపోల్చిన తాతఆగి "ఆ. ఆ. యీ తాతే సెప్పినాడే —వయసొస్తే వంకరగాడిద తిన్నరావుంటాది" యెగాదిగా చూచి ఏమే నూరి ముండా! దర్జాసరసుడ్ని కొంగు నేసి కట్టేసినావే!" అన్నాడు. నూరి చురుక లేచింది.

"ముండా గిండా అన్నావంటే!" తాత పకపకనవ్వుతూ,"అబ్బో కోపమొచ్చిందా! ముండా నీమొగుడు సచ్చాడని అనాలా? పెళ్లాన్ని అక్కరసెయ్యనోడూ సచ్చినోడు ఒకటేకదే! అవునుగానీ మారాము వొచ్చినాడా?"

"ఎవురికి తెల్సు?" గసిరింది నూరి.

భద్రం ముసలాడిమీద మండిపోతున్నాడు తాటాకుల మండపవాసుడూ, రాములు చెల్లెలు చెప్పిన తాత వీడేనని తెలుసుకున్నాక తగ్గిందికోపం వెంటనే, "ఆ—రాములు ఇప్పుడే వచ్చాడు." అన్నాడు.

"మా రాముల్ని మీకెలా తెలుసు బాబూ?"

"మా కొట్లో పనిచేస్తున్నాడు"

తాత గతుక్కుమని, "బద్రం బాబా!" నూరి వేపుతిరిగి, "ఛా ముండా! చెప్పవే- ఎవురో అనుకుని నోటికొచ్చినట్లు మాటనేసాను! దీని ఏపారంయిదే బాబూ! ఫోఫోయే!"

నూరి నడుంకట్టి ముందుకొచ్చింది. ఏమన్నావ్! ముసలోడా!..."

ముసలాడు పకపక నవ్వి, "నీ వొయ్యారం సూసైనా వయసునోడ్ని అవుతానులే!" అన్నాడు భద్రంవేపు తిరిగి, "రండి బాబూ! మీతో సాలకబుర్లాడాల" అని తాత నిర్లక్ష్యంగా ముందుకు నడుస్తుంటే భద్రం అనుసరించాడు.

సూరమ్మ విసవిసలాడుతూ, "ఈ ముసలోడు ఒకనాడు మొగాడా?—వయసునోలసంగతి తెలుసుకోడానికి? ఆ పెళ్ళం రంకు మొగుడితో ఎందుకు పోనాది?" అంటూనే మళ్లీ రోడ్డు వైపు ఒళ్ళు విరుచుకుంటూ నడిచింది.

ముసలాడు యీ మాటలకేమీ అనక పందిరవద్దకు నడచి చేతిలోని చట్టి పుట్టిలో పెట్టుండే భద్రం అన్నాడు.

"బాగుంది తాత! నీ యిల్లు."

తాత నవ్వి, "నీలాగ ఎవురూ అనలేదు బాబూ! గ్రాసం లేకపోతే వుండగలం కాని వాసం లేకపోతే వుండగలమా?" స్వరస్థాయి హెచ్చించి, "అవునమ్మా దాలీ! యీ బాబొచ్చినారు—రండి బాబూ!" ముందుకు నడిచాడు.

రాములు గబగబవచ్చి చింకి చాప తెచ్చి వేశాడు. భద్రం కూర్చుని రుమాలుతో ముక్కు మూసుకున్నాడు. దాలమ్మ యింటిలో తడక తలుపుచాటున నిల్చుంది. దీపం బుడ్డి కుమ్మం ప్రక్కనే వెలుగుతోంది. ముసలాడు కర్ర క్రిందపెట్టి కాలవగట్టున కూర్చున్నాడు.

తాత ఒక్కసారి గొంతుక సవరించుకుని, "పెద్దింటి బాబులు పేదాళ్ళం అనడం మంచిపని కాదు. మరికొడుకు బాగుండాల, కోడలు ముండమొయ్యాలంటే అవుతాదా? అందుకే బాబూ! నాను, మాదాలీ మనస్సు నిడకండా అడిగేస్తాం!"

ముసలాడు ఒకక్షణం జవాబు కోసం ఆగాడు. మళ్ళా అభిమానపూరిత స్వరంతో అన్నాడు. "బాబూ! మనిషి మిగలడు గానీ మాట మిగిలిపోతాది! ఒకరు వుసురుమంటే ఆ పాపంపసిరిక పామై కరుస్తుంది. నీకంటే వయసులో పెద్దోడ్ని. బాగా మనసులో యిడుకో బాబూ ఎందుకు సెప్తన్నానో! ముదరబుర్ర నేకపోతే ఎద్దు బుర్ర తెచ్చుకోమని సాస్త్రం!"

భద్రం యీ అభిమాన స్వరంతో తనవాళ్ళల్లో ఒకడిననే అనుభూతితో సర్దుకుని కూర్చున్నాడు. ముసలాడు యిప్పుడే ప్రక్కకు తిరిగి తన వేపుచూస్తూ నిర్మలమైన నిజాయితీతో అన్నాడు. "బాబూ! మనం గోచీతో పుట్టామా! గోచీకట్టుకోవడం ఎలాగ నేర్చుకున్నామో బతకడం అలాగనే నేర్చుకోవాల. కోపంవస్తాది! అలాగని ఆడోళ్ల వొంటిమీద సెయ్యెయ్యటం!"

భద్రంచప్పున విరుచుక పడ్డాడు. "నీకు ఆయింటి సంగతి తెలీదులే తాతా! అంతా ఒక్కటే!"

తాత కాస్త వుత్సాహంతో, "అమాత్రం సెప్పినావు. సూడు బాబూ! మాకా యింటి సంగతంతా తెలిసినాది. కొట్టినంత తప్పుపని ఆంగా మేన్మంసేసింది? అడిగానని మనసులోయిడుకోకండి—"

దాలమ్మగొంతుక మెల్లగా బాధగా వినిపించింది. "మిమ్మల్ని ఒకలు పాపిష్టోలనెందుకనాలి బాబూ! మీరు సుకంగా బతికితే మాకింకేం కావాల బాబూ! ఇంటమ్మ మొగ్రోమంటే మంచిదికాదు బాబూ!" భద్రం త్రెంచిపారేసాడు "అది పెళ్ళాం కాదు, నేను మొగుణ్ణి కాదు! పెళ్ళానికి మొగుడు సౌఖ్యముందా- అన్నయ్య సౌఖ్యముందా?"

దాలమ్మ పార్వతిని సమర్థించింది. "అన్నా సెల్లీ అబిమానంగా వుండటం తప్పా బాబూ?"

భద్రం స్వరం హెచ్చించి అన్నాడు. "అది కాదమ్మా! నామాటయందు దాని

కెందుకు లక్ష్యంలేకపోవాలి? ఆ రా
నాకు యిప్పుడు శత్రువు—వాడితో దీని
సంబంధం?" మధ్యలో ముసలాడు క
జేసుకున్నాడు. బాబూ! వున్న మా
టాను. పిరికోడు రోజూ సచ్చిపోతాడు.
రోజూ బతుకుతాడు, ఎప్పుడో ఒకప్ప
అతీగతీ నేకసస్తాడు. గుండె నిబ్బరం
మనిషీ, గోతిలో పడ్డగొడ్డూ ఒక్క
బాబూ! పెద్దోలెందుకన్నారు? కార్తి
పడ్డ యిత్తనంగానీ, కాలం ఎరిగిన కో
కైనా వుండాలని."

భద్రం అసలు విషయం గ్రహిం
గభాల్న తలపంకించి, "నేను పిరికోడా
అంటాంటి తండ్రికి ఏంచేసినా తప్పుందీ?

తాత దగ్గరగా జరుగుతూ, నిష్టూ
మందలింపు మిళితమైన స్వరంతో, "నీ
లోటుసేసినాడు బాబూ? లోకమంతా
బాబుకి సేతులెత్తుతూంటే — సెనా ని
పాణం పోతూంటే వొదిలి పైయూళ్ళ
సికార్ల కెళ్తావా బాబూ?"

భద్రంకూడా గొంతుక హెచ్చిం
"వళ్తానా వెళ్ళితీరతానా? వాడు నా
తండ్రీకాడు, నేను కొడుకునూకాను!
కేం తెలీదర్రా!" అంటూ లేచిపోతూం
లోనుంచి దాలమ్మ ప్రతిమాలిం
"కూర్చోండి బాబు! మీ యిల్లు నిలబ
కావాలమాకు. మీకు పున్నెం వుంటా
వున్న సంగతి సెప్పండి."

భద్రం తలపంకిస్తూ, "ఆర్చేవాళ్ళు తీ
వాళ్ళూ యిక ఎవరూ లేరు! జైలుకెళ్లా
నిశ్చయించుకున్నాను.

ఈ అంతరార్థాన్ని గ్రహించకపోయి
దాలమ్మ "హా!" అంటొక్కసారి. పరిపూ
మైన అభిమానం వుట్టిపడగా, "మీ త
తండ్రికి దండంపెట్టాను బాబు! అంత

# బోటు షికార్



# ★ మేడమీద బొమ్మ ★

సెయ్యకండి నావెళ్లి ఆయమ్మని, బాబునీ అందర్ని అడుగుతాను—అళ్ళకాళ్ళు పట్టుకుంటాను."

ముసలాడు కలుగజేసికుని, "మాను పిల్లో మట్టి పిల్లో ఎలకని పట్టితేసాలదా?—నివ్వు దొంగా అంటే సరా బాబు! ఆ దొంగతనం ఏంటో సెప్పాలగానీ—సచ్చిన ఆ బాబు మీకేం లోటుసేసినాడో ముందు సెప్పు బాబూ!" ముసలాడు పంతం పట్టినట్లుగానే అడిగాడు.

భద్రం పిడికిలిపట్టి వుద్రేకంతో ఆగకండా చెప్పాడు "తనంతటి కొడుకున్నానే—నా దగ్గర దాపరికమా? ఆ గతిలేనివాడి క్రింద చదువుకీ, పెళ్ళికి అంత తగలేసి మంచి వుద్యోగంలో వెయ్యించింది చాలక సగం ఆస్తి నన్నడగకండా ధారపోస్తాడా? ఆ మేనల్లుడి అత్త సుందరమ్మ వుంది—దానితో పెళ్ళి ముందుగా చాటుగా యీసంగతి చెప్తాంటే—దేవుడు లేడూ! చాటుగా విన్నాను—ఇదేం బాగుందమ్మా! వారసుడ్ని నేను కదా నన్నడిగి యిస్తే నాకు పైవాడా మా మేనత్త కొడుకేగా—ఎంతో కొంత ముట్టచెప్పేవాళ్ళంగా!" భద్రం కోపంతో గుటకలు మ్రింగి మళ్ళీ వుత్కంఠంతో, "వాడికి యీ ఆస్తిలో భాగంవుందని నా పెళ్ళాం వాళ్ళ ప్రక్క వాదిస్తే నా కెల్లావుంటుంది? నా పెళ్ళామే నన్ను కాదంటే లోకం కాదనదమ్మా! నా తండ్రి నా దగ్గర దాపరికంచేసి చేతకానివాడిని చేస్తే, లోకం నన్ను ఒట్టిచేతకాని వెధవలా చూడదూ?—మీరంతా కలిసి ఎంతచెప్పండి! నా ఆస్తి అంతా నా కొస్తేనే దానిని ఏలుకోవటం—ఇల్లు నిలబడ్డం లేదా అంటే అంతా సరి—జైల్లోపోయి కూర్చుంటాను."

ఇంతసేపు చెవులప్పచెప్పి విన్నవాళ్ళు ఇక మాట్లాడలేకపోయారు. భద్రం అలసిపోయాడు. ముసలాడు, "సాలా పొరబాటు సేసేవు బాబూ! నీ పక్కన సాయం వున్నవ్వాడు యిన్నాళ్ళు వూరుకున్నావు!"

భద్రం అన్నాడు. "ఇంటంతా ఒకటే తాతా! ఆ ముసలాయనకు నాతో సంబంధంలేదు— వాళ్ళిద్దరు కావాలి. అరచి నా గొంతుక పాడుచేసుకోవాలి గానీ!"

తాత మెల్లగా లేచి నిల్చుని, "అమ్మో దాలీ! ఇలాగరా యే" అనిపిల్చాడు. దాలమ్మ బయటకు వచ్చింది. కొంచంసేపు యిద్దరూ గొణుక్కున్నారు. దాలమ్మ బయలుదేరగానే తాత మళ్ళీ కూర్చుని గొంతుకెత్తాడు.

"సింహాద్రి రప్పన్న దేముడూ
మనకు జయము జయము నిస్తాడూ?
దేముడూ!
ఏడుకొండలవాడు దేముడూ
మనకు జయము జయము నిస్తాడూ?
రాముడూ!"

దాలమ్మ రంగయ్యగారి యింటి బయట నిల్చుని, "బాబూ! బాబూ!" అని కేక వేసింది. వెంకట్రావు తలుపుతీసి విసుక్కున్నాడు. "ఏంటి అలవాటే నీకు! ఫో ఫో!" దాలమ్మ యీసారి గట్టిగా అన్నది." రామం బాబు కావాల బాబూ!"

"రామంలేడు గీముంలేడు. ఫో!" అంటూ తలుపు ధాం మనిపించాడు.

దాలమ్మ గుమ్మందగ్గరకు వెళ్ళి గట్టిగా అరచింది. "రామం బాబూ! రామం బాబూ!"

సుందరమ్మతో మాట్లాడుతున్న వెంకట్రావు మండిపడి లేచివస్తూంటే మేడమీద నున్న రామం గబగబ దిగాడు. ఈలోగా వెంకట్రావు దాలమ్మమీద గర్జిస్తూంటే రామంవచ్చి, "ఏవమ్మా ఏం కావాలి?" అన్నాడు.

"మీ కేకదూ బాబు రామంబాబు! భద్రం బాబు కబురంపినారు! మీతో సాల సెప్పమన్నారు!! రామం ఆతృతగా, "రా అమ్మా! లోపలకిరా!" అన్నాడు. దాలమ్మ లోపలికివచ్చి చేతులు దగ్గరగా చేర్చి నిల్చుంటే కూర్చోమన్నాడు. దాలమ్మ కూర్చుని, క్షణం పాటువూరుకుని, వినయపూర్వకంగా అంది.

"ఆ బాబు వున్నమాటన్నాడు. పెద్ద బాబులు ఆలోసించండి! పెళ్ళాం మొగుడి మాట కెదురెత్తే మొగోడికి ఎలాగుంటాది బాబూ?"

వెంకట్రావు బిగ్గరగా, "సరిపోయింది! అబద్ధాలతో ఇంటిగుట్టుని ఖూనీ చేస్తున్నాడూ! ప్రయోజకత్వం అంతగా ఏడుస్తోంది!"

దాలమ్మ సవినయంగానే, "మీ భార్య గోరే, మిమ్మని కాదంటే మీమనసెలాగవుతాది బాబూ!" ఈ ప్రశ్న వెంకట్రావు కన్నా రామానికి సూటిగా నాటింది. సుందరమ్మ దాలమ్మ వచ్చిన దగ్గరనుంచి కుతకుత వుడికిపోతోంది.

వెంకట్రావు దాలమ్మ ప్రశ్నకు, "నివ్వా అడిగేదానివేనా ముండా? రాయభారం వచ్చింది, రాయభారం!" ఈయన వైఖరి రుచించనట్లుగా రామం వెంకట్రావు వైపు చూశాడు. దాలమ్మ తల ఆడించి, "ముండనే బాబూ! ఆ బాబు మా గుడిసెలో వున్నారు. రామం బాబునే అడుగుతున్నాను—ఆ యమ్మ నేలుకోవాలంటే మీ పేరనవున్న ఆస్తిఅంతా ఆ బాబు పేరన రాయాలట!"

వెంకట్రావు లేచాడు. "ఫో ఫో యెు! తీసుకొచ్చింది కబురు!"

సుందరమ్మ, "మరేం?" అని వూరుకుంది. దుఃఖంలో మ్రగ్గిపోతున్న పార్వతి స్తంభం చాటునుంచే, "అదెలా ఔతుంది?" అని గొణిగింది.

రామం అలానే కళ్ళను నేలకు అప్పచెప్పి చూస్తున్నాడు. దాలమ్మ మిగతావారెవరినీ లెక్కచేయకండా రామంవైపు తిరిగిదీనస్వరంతో మొదలు పెట్టింది.

"అంతా తెలిసిన బాబులు. ఆలోసించండి బాబూ! తనంత కొడుకుంటే అడక్కండా అన్ని పనూలూ సెయ్యటమే! లోకం సెడ్డందని కనుకున్న పాణం సెడ్డంటే యింకా బాబు బతకాలా? అంత కడుపు సల్లనైన బాబు నోకంలో నేడు. మీరేం గడించినారా? కొడుకుది ఆస్తిగాని, మేనల్లుడిదా ఆస్తి? ఆలోసించండి బాబు — మీరు కాదంటే ఆ బాబు కైదులో కూసుంటారుట!"

రామం అప్పటికి మాట్లాడలేదు. వెంకట్రావు మూతి బిగపెట్టున్నాడు. సుందరమ్మ చిరాకు పడుతోంది.

రామం ఒకసారి దాలమ్మవైపు చూశాడు. సవినయంగా చేతులు నులుపుకుంటూ బాధతో కూర్చుంది. ఈ ఆస్తితో తనెందరినో సంతోషపరచాలనుకున్నాడు. జీవితాంతం ఆనందంగా గడిపి హాయిగా కాలుమీద కాలువేసికుని బ్రతుకుతా ననుకున్నాడు. నలుగురూ తన్ను యిప్పుడే గౌరవిస్తున్నారు. తన దినాలు మారాయి - జీవితంమీద ఎంతో ఆశపుట్టింది. తనకు జ్ఞానం వచ్చిన దగ్గరనుండి యీ ఆస్తిలో భాగస్తుడనన్న గర్వం మనసులో ఒక మూలనుండేది. పరిపరి విధాల ఆలోచిస్తున్నాడు. ఆ ఆస్తి ఎటువంటిదో కళ్ళకు కట్టోంది—మూడు విశాలమైన మేడలు, ఎంత అందమైనవి! తన జీవితకాలమంతా శ్రమపడినా అందులో ఒక గది కట్టించలేడు. తనకు వుద్యోగంతో నిమిత్తమేముంది? ఇళ్ళ అద్దెలు నెలకు 250 రూపాయిలు వస్తాయి! ఇక భూమిమీద వచ్చే రాబడి తనుతినగా, అమ్మగా నలుగురికి పెట్టవచ్చు. పదికరాలు నిక్షేపంలాంటి గడ్డలో ఒకసెంటు భూమి తను గడించలేడు! ఇటువంటి ఆస్తి గనుకనే తన అత్తగారు పడ్డప్రయాసకూడ

తన కళ్ళెదుటవుంది! తను తొందరపడితే అంతా ఒక్క నిమిషంలో సరి! జానకికి తనకూ మధ్య ఒక్క పెద్ద అఖాతం ఏర్పడుతుంది. ఆమెను విడచి తను బ్రతకలేడు— నిజం!

దాలమ్మ గద్గద స్వరంతో అంది, "బాబూ! డబ్బుండి పోతాదా? ఇల్లు నిలపండి—" వెంకట్రావు చర్రున లేచి, "నోరు మూసుకుని పోవే ముండా!" అని గసిరాడు. సుందరమ్మ కొరకొర దాలమ్మవైపు చూస్తోంది.

కొంతకాదు ఆస్తి అంతాను తనుగడించాడా? ఐనా తను భార్యతో సంఘంలో బ్రతుకుతున్నాడు. తన్ను మాలిన ధర్మమా! త్యాగం గురించి యిదివరకెప్పుడూ ఆలోచించలేదు. ఇంతవరకు తను త్యాగం అంటూ ఏమీ చేసిందిలేదు. సుఖం గురించి చాలసార్లు మనసులో మేడలు నిర్మించుకున్నాడు. ఒక్కసారి యీ కోరిక బండరాయిలామీద పడటంచేత ఎటూ నిర్ధారించలేక వుక్కిరి బిక్కిరి ఔతున్నాడు. ఎందుకివ్వాలనే పంతంకూడ మనసులో మెల్లగా స్థానం ఏర్పరచుకుంటోంది. ఇంతసేపూ తను అమితంగా ప్రేమిస్తున్న భార్య, ఆమె అందం, అమాయకత్వం వివిధఘట్టాల అనుభూతులతో తన్నాశ్రయించివుంది. చప్పున తన మనసులో మెరపుతీగ మెరసింది. మనసున అపాడుపడిన గోడమీద బొమ్మ మెరుస్తోంది. ఆలోచన లిప్పుడు ఆశాపూరితంగా మనసులో మెదలుతున్నాయి! తన దెందుకు పెద్ద గుండె కాకూడదూ? అప్రయత్నంగా వక్షం నిమురుకున్నాడు. అప్పుడే జిజ్ఞాస కలిగింది. ఈ ఆస్తి తను గడించిపెట్టాడా? తను వారసుడా? తలెత్తి చూడగానే ఎదురుగా స్తంభంచాటున అవనతవదనయై యున్న పార్వతి కనబడింది. నాలిక కరచుకున్నాడు, ఇంతసేపూ భాగ్య భోగముల మీద నున్న ఎడతెగని మమకారంతో చెల్లెలింతవరకు జ్ఞాపకం రాలేదు. ముఖం తేటపరచి మెల్లగా అన్నాడు.

"ఈ ఆస్తి నాదికాదు. భద్రం బావదే!" పార్వతి సన్న గొంతుకతో, "అదేలా కొంతుందన్నయ్యా!" అంది.

రామం లేచిపోయి, "ఈ విషయంలో ఏమీ అనకమ్మా!" అని, దాలమ్మవైపు తిరిగి, "నడమ్మా! నీతోవస్తా" నన్నాడు. దాలమ్మ లేచి నిల్చుంటుంటే, వెంకట్రావు గాభరాగా, "ఏం బావా! నీకేం మతిపోయిందా ఏం?"

"లేదు బావా!"

వెంకట్రావు ముఖం ముక్కిపోయి నటయిపోయింది, మోటగా అన్నాడు.

"ఖానికోరుకోయి సమర్పిస్తావ్! ఈ ఆస్తితోనే నీ బ్రతుకుందని తెలుసా?"

రామం చులకనగా, "ఖూనీకోరా! ఎవరు?"

"ఎవడా? తండ్రిని చంపాడోయ్ ఆ పూజ్యుడు!"

"బావా! గట్టిగా మాట్లాడినందువల్ల లాభం లేదు"

"అవునవును. నిజంచెప్తే యీ రోజుల్లో వెటకారం!" కాస్త గొంతుక హెచ్చించి, అభినయంతో, "సాక్ష్యం యిదిగో మీ చెల్లెలేవుంది. ఆ కొడుకన్న రాస్కెల్ ఆ రాత్రి చెంపపెట్టు తగిలిస్తేకదోయ్; ఆ ముసలాడు దిగులుతో మంచంపట్టేంది! ఇల్లు తగలడిపోతూంటేనీకు హాస్యంగావుందేం?"

రామం యీ చివర వాక్యం రాకముందే "హాఁ" అంటూ నిర్విణ్ణుడయిపోయాడు. నెత్తురుచుక్క ముఖానలేక వెలవెల బారింది. వెంకట్రావు తలాడిస్తూ, "నువ్వు అత్తారింటికి వళ్ళిన ఆ రాత్రినుండీ ముసలాయన యిల్లు కదిలాడా? సరేలే! వాడు తగిలేస్తే అవతల ఆదరించిన అత్తగారు యిటుయింతా నీకోసం యిదైన నేను యిప్పుడు పగవాళ్ళమైపోయాం! నిన్నని లాభం ఏమిటి? ఈ కాలంలో అసలు మనుష్యులే మారిపోతున్నారు!"

అందరూ నిశ్శబ్దంగా వున్నారు. దాలమ్మ హీనమైన కంఠస్వరంతో, "బాబూ! ఆ బాబు అలా సెయ్యరు బాబూ! ఆ బాబుకి కడుపునిండా దయ!"

వెంకట్రావు ఆమెమీద కొక్క ఎగురు ఎగిరాడు. "అబద్ధమా! అంత నామర్దా మనిషినను కున్నావే ముండా! పెద్ద పెద్ద వాళ్ళచేతనే ఏమాటా అనిపించుకోలేదు!"

దాలమ్మ మిటుకు మిటుకుమని చూసెంది. వెంకట్రావు యిటుఅటూపచారు చేస్తూ, "బావా! ఆయన యివన్నీ ఆలోచించకుండా వీలురాసాడటోయ్! ఆస్తి పదికాలాలపాటు నిలవాలని గడించిన వాడికుండదా? ఆ వీలుమీదనున్న ఆయన దస్కతునైనా గౌరవించు! నువ్వు ఆ భద్రం గార్దభస్వరాన్ని సంగీతంగా ఆనందిస్తావా? బాగా ఆలోచించు. వాడా నిర్గంధకుసుమం—వాడికచుట్టూ చేరిన కిష్టయ్యవగైరాలుకు ఎంత సంస్కారంవుందో నేను నొక్కి చెప్పాలటోయ్!"

"బావా! యీ లోకంలో పూర్తి సంస్కారం కలవాడవు నువ్వొక్కడివేలే!" అంటూ గబగబ బయటకు నడిచాడు.

## 21

రంగయ్యగారి కర్మకాండంతా భద్రం చేతిమీదనే రామం జరిపించాడు. ఈ తొమ్మిది రోజుల్లో యింట్లో బావమరదులు అన్యోన్యంగా మెసలటంచూసిన పార్వతి దుఃఖాన్ని చాలవరకు మరచిపోయింది. నరసమ్మ మంచంపట్టినా అప్పుడప్పుడు వాళ్ళిద్దరూకలిసి మాట్లాడుకోవటం చూచి మనస్సులో సంతృప్తివహించేది.

రంగయ్యగారు పోయిన పదమూడవ రోజు వచ్చింది. వచ్చిన చుట్టములు, బంధువులు వెళ్ళిపోయారు. ఇంటో సీతాలక్ష్మి భద్రం కోరికపై మరిరెండు రోజులుంచటానికి ఒప్పుకుంది. రామం యీ రోజునే సాయంత్రము యిల్లు కదలటానికి బయటకు వచ్చాడు. ఈ వేళ వుదయం నుండి చాలవరకు ఆలోచించాడు. ఇంతకాలం తనే బరువైతే మోయలేక గింజుకొని శక్తివిహీనుడై మనస్సును సంతోషపరచుకున్నాడో, ఆ బరువు యిప్పుడు భద్రం వావదంచేశాడు. తన చెల్లెల బ్రతుకు యిప్పుడు చక్కగా కుదుటబడుతుంది. తన జీవితంలో ముఖ్యకోరిక నెరవేరింది. అందుచేతనే తను స్వచ్ఛంగా, మన స్ఫూర్తిగా మామయ్యగారి మాటలను శిరసావహించవలెనని నిర్ణయించుకున్నాడు.

అత్తవారింటికి వెళ్ళేసరికి చిన్న బావమరది వీధి తలుపుతీశాడు. "బావా!" అంటూ ఒక్కగంతు వుల్లాసంగా గెంతి రామం దగ్గరకు వచ్చాడు. మంచంమీద కూర్చున్న సుందరమ్మ ముఖం ప్రక్కకు త్రిప్పింది. జానకి కోసం నలుమూలలా చూశాడు, కాని కనపడలేదు.

రామం మెల్లగా మంచందగ్గరకు వెళ్ళి నిల్చున్నాడు. అత్తగారి వైపుచూడలేక తలదించుకుని కొంతసేపు మాటలు కలిపే

(52-వ పేజీ చూడండి)



# విజ్ఞానవీధులు

"డాక్టర్"



## 104. గెలవేసిచచ్చిపోతుందా అరటి చెట్టూ?

గెలవేసిన అరటి 'చెట్టు'ని ఆ గెల ముదిరినతర్వాత కొట్టేస్తారు. గెల కొట్టేసిన తర్వాత 'చెట్టు' ని కొట్టేయకుండా వదిలి పెట్టినా ఆ 'చెట్టు' దానంతట అదే చచ్చిపోతుందని ఒకనమ్మకముంది. ఇది సామాన్య దృష్ట్యా నిజమే అయినా, గెలవేసిన అరటి చెట్టు చచ్చిపోతుందన్న ఊహమాత్రం తప్పు. తప్పున్నరకూడాను.

చెట్టంటే ఏమిటి? అని అడుగుతున్నాను. పూతొడిమా, ఆకులూ చేరితే చెట్టా? మామిడి పూగుత్తి చూడండి. ఒక రెమ్మ, ఆకులూ, కొసని పూగుత్తీ వుంటాయి. పూల గుత్తి కాయలు కాచి ఆ కాయలు కోసేసిన తర్వాత ఏమౌతుందీ? ఎండిపోదూ? దానికి మళ్లీ చివురు పెట్టకపోతే మామడిచెట్టు చచ్చిపోయిందంటామా? గెలవేసిన అరటిచెట్టులో జరిగేదికూడా సరిగ్గా ఇదే.

అరటిచెట్టుకి వేళ్ళుంటాయని సులువుగానే తెలుస్తుంది. దుంపయే అరటి చెట్టు కాండము. దీనికి అన్ని చెట్ల కాండాలకిలాగే కొమ్మ మొగ్గలు పుట్టి అరటిపిల్లలుగా వృద్ధి అవుతాయి. అరటి దొప్పలు ఆకులతాలూకు తొడిమలు, అరటి దూట పూగుత్తియొక్క రెమ్మ, మామిడి కాయలు కోసేసినతర్వాత ఆ రెమ్మ, దాని కిరువైపులావున్న ఆకులూ వాడిపోయినట్లే అరటిగెల కోసినతర్వాత ఆగెల తాలూకు రెమ్మ (దూట) తొడిమలతోసహా ఆకులూ (దొప్పలతో చేరిన ఆకులూ) వాడిపోతాయి. ఇవి ఎలాగూ వాడిపోయి ఎండిపోతాయిగదా అని, గెల కొట్టేసిన తర్వాత గెలవేసిన ఆ రెమ్మని ఆకుల తొడిమలతో సహా కొట్టి పారేస్తాము. ఈ కొట్టేసేదికాదు అరటిచెట్టంటే. పిల్లలతో కలకలలాడేది అంతా కలిపి అరటిచెట్టు. అన్నిటినీ కలిపే దుంప కాండము. ఒక్కొక్క పిల్ల ఒక్కొక్క పూరెమ్మ.

ఉల్లిపాయకూడా ఇంచుమించు ఇలాంటిదే. వేళ్ళు అందరమూ చూస్తాము. వేళ్ళు అతుక్కొని వుండే 'బొడ్డు' కాండము. ఉల్లి రేకులన్నీ ఆకులు. ఉల్లికాడ పూరెమ్మ. అంటే ఉల్లిపాయలో మనం తినేవి ఆకులన్నమాట.

## 105. సముద్ర తీరపు ఇసుక కెరటాలు

సముద్రతీరపు ఇసుక దిబ్బలమీద కెరటాలు కెరటాలుగా ఇసకా నల్లనిమట్టిపొడీ కలిసి ఏర్పడడము చాలామందిచూచి వుంటారు. సముద్రపుతీరమే అక్కరలేదు. ఇసకదిబ్బలూ గాలీ ఉన్నచోటనల్లా ఈ కెరటాలు కనబడతాయి. ఇవి ఎలాగు ఏర్పడతాయీ? అని ప్రశ్న.

ఈ 'కెరటాలు' ఎడారుల్లోకూడా ఏర్పడతాయి. అయితే ఎడారులలో ఇసక జాస్తిగా వుంటుంది కనక ఇవి 'కెరటాల' కంటె బలిసి, దిబ్బలౌతాయి. ఒక్కొక్క దిబ్బా పంచమి చంద్రవంకలాగుటుంది. ఒకటో




పటము చూడండి. 'రయల' దిబ్బయొక్క కింది అంచు. 'రవల' మీది అంచు. 'రసల' వెనక అంచు. 'రవల' నుంచి 'రసల' కు వాలు లేక వరకము హెచ్చు. మనము దిగాలంటే కిందకి గెంతి దిగాలి. 'రయల' నుంచి 'రవల' కి వాలు తక్కువ, సునాయాసంగా ఎక్కవచ్చును. ఇలాటి దిబ్బలు పల్లెటూళ్ళకి రెండుమూడు మైళ్ళదూరాన్నున్న సముద్ర తీరంకూడా కనబడతాయి. 'రసల' నుంచి 'రవల' కి ఎక్కడము కష్టము. కాలికింది ఇసక దిగిపోతూంటుంది. రెండో పటము 'కచ' వెంబడిని కోసిన అడ్డకోత. 'మట' అన్నది దిబ్బకి ముందువైపున్న వాలు. 'టడ' అన్నది వెనకవైపుది, వాయుప్రవాహము బాణములవల్ల సూచించబడింది. రెండో పటములో చూపినట్లు గాలి ప్రసరించి ఇసకని కుప్పపోస్తుంది. గాలితుడిచేస్తూండడము వల్ల 'మట' అనే ముందువైపు వాలు తక్కువగా వుంటుంది. 'ట' ని దాటి గాలి సాగిపోయినప్పుడు, 'టడ' కి ఎడమవైపున ఉన్న




గాలికూడా పైనున్న గాలిప్రవాహములోకి తోడుకుపోతూ వంకరబాణము చూపేటట్టు ప్రసరిస్తుంది. అందువల్ల 'టడ' అనే వెనక పార్శ్వము పటములో చూపెనట్లు వంగి ఉంటుంది. గాలి వీచుతున్నకొద్దీ 'మట' వెంబడినిఉన్న ఇసుకా, 'టడ' వెంబడిని వున్న ఇసుకా గాలితో లేచిపోతూనూ వుండాయీ, వచ్చేగాలితో పెరుగుతూనూ వుంటాయి.

అయితే గాలి ఒకే దిక్కువైపు వీచుతూండవచ్చునుగాని సరిగ్గా ఋజురేఖలలో ప్రసరించదు. కనక ఇలాగ ఒకచోట కుప్ప కూడిన ఇసక అక్కడే స్థిరపడిపోక జరుగుతూన్నట్టు కనపబడుతుంది. ఎడారులలో వేలకొద్దీ ఏర్పడే ఈ దిబ్బలకి 'డ్యూను' లంటారు. గాలి బలముగావీచుతూన్నప్పుడు ఈ డ్యూనులు జరుగుతున్నట్టుగా కనిపడతాయట. సముద్రపు ఒడ్డునున్న గాలి ఎడారి గాలి అంతబలమైనదీ కాదూ, ఇసుకకూడా ఎడారిలోనున్నంత సమృద్ధిగానూవుండదూ. కనక దిబ్బలకి బదులు 'కెరటాలు' ఏర్పడతాయి. ఈకెరటాలుకూడా తిన్నగావుండక వంకరటింకరగా వుంటాయి. గాలి వీచే దిక్కుమారడమే దీనికి కారణము.

ఆరేళ్ల కుర్రాడు యింట్లో పైఅంతస్థు నుంచీ క్రిందికి 'అమ్మా! అమ్మా!' అని అరుస్తూ గబగబా దిగి వచ్చాడు.

"ఏం నాయనా! ఎందుకూ?" అని తల్లి అడిగింది.

"మరేమోనే — నాన్నేమోనే పటం తగిలించటానికి గోడలో మేకు దిగ్గొట్టుతూంటే సుత్తివచ్చి ఆయనవేలికి తగిలిందే!"

"అదేమిటిరా! ఆమాత్రానికి నీలాంటి మంచిపిల్లాడు యింత యిడిగా దిగులు పడి ఏడుస్తారా? చక్కగా నవ్వాలి కానీ?"

"నవ్వానే అమ్మా!" అంటూ ఆ కుర్రాడు వెక్కి వెక్కి ఏడ్చాడు.

## 106. వస్తువు బరువు అన్నిప్రదేశాలలోనూ సమానంగా వుంటుందా?

ఈ విషయాన్ని గ్రహించాలంటే అసలు బరువంటే ఏమిటో ముందు తెలిసికోవాలి. భూమి ప్రతివస్తువునీ తన వైపుకు అంటే తన కేంద్రంవైపుకు లాక్కొంటుంది. ఈ విధంగా ఒక వస్తువును భూమి ఎంత బలంతో ఆకర్షిస్తుందో ఆ బలాన్నే ఆ వస్తువుయొక్క బరువు అంటారు. దీనిని బట్టి ఏదైనా ఒక వస్తువుపై భూమివల్ల ప్రవర్తించే ఆకర్షణబలం ఆ వస్తువును భూమిపై ఎక్కడకు తీసికొని వెళ్ళినా సరే సమానంగా ఉంటే ఆ వస్తువు బరువు భూమిపై అంతటా సమానంగా ఉంటుందనీ, లేకపోతే దాని బరువులో ప్రదేశాన్నిబట్టి వ్యత్యాసం వస్తుందనీ మనం గ్రహించవలసియుంది.

భూమినుండి ఒక వస్తువుపై ప్రవర్తించే ఆకర్షణబలం ఆ వస్తువు ద్రవ్యరాశినిబట్టీ, భూకేంద్రంనుంచి దానికి గల దూరాన్నిబట్టి ఉంటుంది. ఒక వస్తువుపై భూమి ఆకర్షణబలం భూకేంద్రంనుంచి ఆ వస్తువు దూరం హెచ్చిన కొలది తగ్గుతుంది. భూకేంద్రానికి కొన్ని మైళ్ళ దూరంలో నున్న ఆ వస్తువుపై భూమి కొంత ఆకర్షణబలాన్ని ప్రవర్తిస్తే, అంతకు రెట్టింపు దూరంలో భూకేంద్రంనుంచి ఆ వస్తువున్నపుడు దానిపై భూమి ప్రవర్తించే ఆకర్షణబలం మొదట ప్రవర్తించిన ఆకర్షణబలంలో నాల్గవ వంతే ఉంటుంది. అంటే ఒక వస్తువు బరువు భూతలంమీద ఒక ప్రదేశంలో ఒక వీశ అయితే సరిగా ఆ ప్రదేశానికి నడినెత్తిని రమారమి 4000 మైళ్ళ ఎత్తులో దానిబరువు 30 తులాలే ఉంటుంది.

భూమి సమగోళంగా లేదనీ, ఉత్తర దక్షిణాలలో అది కొంచెం అదుముడు పొంది యున్నదనీ మనకు తెలుసును. భూకేంద్రంనుంచి భూతలంపై అన్ని ప్రదేశాలూ సమాన దూరంలో లేకపోవడంవలన అన్ని ప్రదేశాలలోను భూమ్యాకర్షణబలం సమానంగా ఉండదు. దానినిబట్టి భూమిమీద అన్ని ప్రదేశాలలోను ఒకే వస్తువు బరువు సమానంగా ఉండదని స్పష్టమౌతుంది.

భూమధ్యరేఖమీది ప్రదేశంకంటె ధ్రువముల చెంతనున్న ప్రదేశం భూకేంద్రానికి దగ్గరగా ఉంటుంది; విమానం పై కెగిరిన కొలదీకూడా భూకేంద్రానికి దూరమౌతుంది. అందుచేత భూమ్యాకర్షణ బలం భూమధ్యరేఖమీద ఒక ప్రదేశంలో నున్న వస్తువుపై కంటె అదే వస్తుల ధ్రువాలచెంతనున్నపుడు ఎక్కువగా ఉంటుంది ఆవిధంగానే ఆకాశంలో పై కెగిరిపోతున్న ఒక వస్తువుపై కంటె అదే వస్తువు భూతలాన్ని అంటి పెట్టుకొని యున్నపుడుకూడా భూమ్యాకర్షణబలం దానిపై ఎక్కువగా ఉంటుంది. అంటే ఒకే వస్తువు భూమధ్యరేఖా ప్రాంత ప్రదేశాలలో తక్కువ బరువును, ధ్రువాలచెంత ఎక్కువ బరువును కలిగియుంటుంది; భూమధ్యరేఖ ప్రాంత ప్రదేశంనుండి ధ్రువప్రాంతానికి తీసుకొనిపోయిన కొలదీవస్తువు బరువు హెచ్చయింది. ఇక భూతలంమీద నున్నపుడు కంటె విమానంలో పై కెగిరిపోతున్నపుడు కూడా ఒక వస్తువు బరువు తగ్గుతుంది.

అయితే మామూలు త్రాసులో కట్టెలు పెట్టి తూచిమూడడంవల్ల యీ విషయాన్ని తెలిసికోలేము. త్రాసుయొక్క ఒకసిబ్బిలో నున్న వస్తువుపైనా, సెబ్బిలో ఆ వస్తు ద్రవ్యానికి తుల్యమైయున్న ద్రవ్యాన్ని కలిగియున్న కట్టెలపైనా కూడా సమాన ఆకర్షణ బలాన్నే భూమి ప్రవరిస్తూండుటచే ఆ త్రాసుతో తూస్తున్నంతవరకు, భూమిమీద ఎక్కడకు తీసికొని వెళ్ళినా సరే, ఆ వస్తువుబరువులోమార్పుకనిపించదు. భూమ్యాకర్షణబలంతో నిమిత్తం లేకుండా, వస్తువు బరువు ఎక్కువైన కొలదీ యెక్కువగాను, వస్తువుబరువు తక్కువైనకొలదీ తరచుగుణం తక్కువగానూ సాగుతూ వస్తువుల బరువులో వచ్చే కొద్దిపాటి మార్పునుకూడా చూపించగల తీగ త్రాసు సాహాయంవల్లనే ఈ విషయాన్ని మనం గ్రహించగలం. తీగ త్రాసుతో తూచినప్పుడు ఒక వస్తువు బరువు ఏరోప్లేనులో తక్కువగానూ, భూమిమీద ఎక్కువగానూ, ధృవాల దగ్గర ఇంకా ఎక్కుగానూ కనపడుతుంది. అలాగే, ఒక వస్తువు బరువు, భూమిమీద కంటె, తక్కువ ద్రవ్యముగల చంద్రగ్రహము మీద తక్కువగా వుండాలి.

—అనంత్.

## చిట్టిప్రశ్నలు - జవాబులు

—'మనుష్యుడు కోతినుండిపుట్టెను' అన్న అభిప్రాయము అక్షరాలా నిజముకాదు. మనిషీ, కోతీ, ఒరాంగుటాంగూ, చింపంజీ, ఇవన్నీ, ప్రాణుల క్రమపరిణామంలో జీవ వృక్షపు కాండమునుంచి వేరైపోయి ప్రత్యేకముగా చాలా వరకూ పెరిగిపోయిన ప్రాణులు. చెట్టులో ఒక కొమ్మయొక్క కొసకీ, ఇంకో కొమ్మయొక్క కొసకీ సంబంధము యెట్టిదో, కోతికీ మనిషికీ సంబంధము అట్టిదే. కోతీ, మనిషీ వంటి జంతువుల 'మూలపుజంతువు' ఒకటేనన్న అభిప్రాయమే ఇప్పుడు అంగీకారములో ఉంది. ఈ రెండింటికీ మూలపు జంతువు ఒకటి కాదని నిష్కర్షగా ఎవరూ నిరూపించలేదు.

—ద్రవములు నొక్కితే - రబ్బరుబంతిలాగు - నొక్కుడు పడవు ద్రవాల్ని నొక్కితే, ఆ ఒత్తిడి, ద్రవము ద్వారా అన్నివేపులా వ్యాపించి, ఆ ద్రవమును చుట్టివున్న సీసాకు అందుతుంది. అంటే, నీటితో నిండిన గాజుసీసాకు బిరడా అమర్చడానికి నొక్కితే ఈ ఒత్తిడి సీసాలోవైపు కంతటికీ అందుతుంది. నీరు, మనము బిరడాని నొక్కుతూన్న శక్తితో సీసాని లోపలినుంచి పైకి నొక్కి, పగలగొట్టుతుంది.





కూరల బజారులో బేరసారాలు
శ్రీ వి. ఎస్. హరిశ్చంద్రశర్మ





## ర్ల రామారావు
## చిత్రకళాశాల

లు చిత్రించిన చిత్రాలు

మండ్రిలో యీసంస్థ యాజమాన్యాన
ళా ప్రదర్శనం జరిగింది)



కోయ దంపతులు
శ్రీ కాళహస్తి పార్వతీశము



నృత్యకేళి
శ్రీ ఎం. సీతారామాచార్యులు






# వేడి కోలు



“శ్రీ మూర్తి”

నవ్వుతూ కేరుతూ అటునిటూ ఊగుతూ
పువ్వునై కొమ్మల్లొ పైన ఉంటాననుకో
ఓయమ్మ నాజాడ
తీయ గలవే నీవు ?
'ఎక్కడున్నావురా నాచిట్టి తండ్రని·
దిక్కు దోచక నీవు కేక లిడుతుంటేను
వట్టి పిచ్చిది అమ్మ లోకమే తెలియదని
లోలోన నవ్వుకుని జాలిపడతానమ్మ
అమ్మ, ప్రత్యూషపవ
నాంకురా లోలయుతరి
విఠ్ఠల స్వామి కో
వెలచెంత తోటలో
పుష్పాపచయముకై
పూసెజ్జతో పోవు
దారిలో నీపాద
ధూళిలో శయనించి
మల్లినో జాజినో మందారనో యయి
చల్లని నికనులలో వెలుగు తాననుకో
తల్లి, ననుగ్రుచ్చెత్తు కోవా ?
ఉల్లమలరగ ముద్దాడుకోవా ?
కోపమా నాపైని పాపినానేను ?
పాపగానా, తల్లి, పసివాడగానా ?

(రవీంద్రుని అనుసరించి)




డాక్టర్ జాక్ అనే జంతు తత్వ శాస్త్రవేత్త ఏల్ విశ్వ విద్యాలయంలో కొన్ని పరిశోధనలు చేస్తూ, 6 చింపాంజీ పిల్లలకి, ఎక్కడ లేని డబ్బు ఆశ చూపెట్టాడు. 'చింపో-మాట్' అనే ఒక రకమైన యంత్రాన్ని తయారు చేయించి, దాన్ని ఆచింపాంజీ పిల్లలకి అందేలాగా పెట్టించాడు. తెల్లటి గుండ్రని అట్టముక్క ఒకటి పట్టుకొచ్చి ఆమిషన్‌లో పడవేశాడు. వెంటనే అందులో నుంచీ ఒక ద్రాక్షపండు వచ్చింది. ఇలా రెండు మూడుసార్లు ఆ తెల్లటి అట్టముక్కలను ఆ యంత్రంలో పడవేసి ద్రాక్షపళ్లు సంపాదించే మార్గమేదో వాటికి చూపెట్టాడు ఆతరువాత ఒక బుట్టనిండా యీ తెల్లటి అట్టముక్కలు తీసుకొచ్చి, బుట్ట పళంగా ఆ ఆరు చింపాంజీలూవున్న బోనులలో పెట్టించాడు

చింపాంజీలకి ద్రాక్షపళ్లు అంటే మహాయిష్టం. వీటిలో ప్రతిచింపాంజీ పిల్లకూడా యీ మిషన్ ఎలా పని చేస్తుందో యిట్టే తెలుసుకొన్నది ఆక్షణం నుంచీ ప్రతి చింపాంజీ కూడా ఆబుట్టలోని తెల్ల అట్టముక్కలను పట్టుకుపోయి యంత్రంలో పడవేయటానికి చాలా తొందరపడ్డది. అంతేకాదు— ఆ వెధవ అట్టముక్కల కోసం, అంత వరకూ ఎంతో అన్యోన్యంగా బ్రతుకుతున్న యీ ఆరు చింపాజీలూ, ఒకదానిపై ఒకటి పగలు పూనటం ప్రారంభించాయి.

వీటిలో యీ ధనదాహం అంత వరకూ వచ్చాక డాక్టరు జాన్, యిత్తడి రేకుతో చేసిన కొన్ని గుండ్రటి బిళ్లలను కూడా ఆబోనులో పెట్టించాడు. ఆయిత్తడి బిళ్లలను మిషన్‌లో పడవేస్తే ద్రాక్షపండు కాదుగదా, మరేది కూడా రాకుండా దాంట్లో ఏదో ఏర్పాటుచేసి పెట్టాడు. చింపాంజీలు ముందు ఆయిత్తడి బిళ్లలకోసమూ పెనుగులాడాయట కానీ, తీరా వాటిని వుపయోగించి నిష్ప్రయోజనమని తెలుసుకొన్నాక వాటి జోలికి పోనేలేదు.

ఆవిధంగా కొంతసేపు గడిచాక బోను యివతలనుంచీ యీయన యిన్ని యిత్తడి బిళ్లలు, యిన్ని అట్టముక్కలు లోపలికి విసిరేశాడు. అంతటితో ఆబోనులో వున్న ఆరు చింపాజీలు ఒక్కసారిగా అక్కడ మూగేసి తెల్లబిళ్లలను మాత్రమే ఏరుకొని దాచుకొన్నాయి. (మద్రాసు వీధుల్లో రాత్రిపూట కొట్ల యజమానులు తమ అంగళ్లకు బూడిద గుమ్మడి కాయలతో దిష్టితీసి, వాటిని నడిరోడ్డుమీద బద్దలు కొట్టుతూ వుంటారు. ఆగుమ్మడి కాయలో కానియో, అర్ధణాయో కూడా పెట్టి పగలకొట్టుతారు. ఈవిషయం తెలిసిన బిచ్చగాళ్లు, సరిగ్గా ఆసమయానికి అక్కడ పెద్దగుంపుగా చేరిపోయి, అది సరిగా నేలమీద పడీ పడకముందే, తమందరూ కట్టగట్టుకు దానిమీద పడిపోయి, ఆకాని కోసం తన్నుకొంటారు. బూడిద గుమ్మడికాయల పిచ్చుల కేసి ఒక్కరైనా చూడరు. సరిగ్గా యిలాగేచింపాంజీలూ చేశాయన్నమాట!)

## ★ జంతుకోటిలో మానవ లక్షణాలు ★

తెల్ల బిళ్ళ పడేసి ద్రాక్షపళ్లు సంపాదించుకోవడం ఆ చింపాంజీలకి బాగా అలవాటైనాక, డాక్టరు జాన్ ఆ యంత్రంలో చిన్న కిటుకు ఏదో చేసి, బిళ్ళ అటు పడెయ్యగానే యిటు ద్రాక్షపండు వచ్చెయ్యకుండా, కొద్ది క్షణాలు గడిచాక ఆ ద్రాక్షపండు దొర్లివచ్చేటట్లు చేసి, యీ చింపాంజీలు ఏం చేస్తాయో చూస్తూకూర్చొన్నాడు

ఒక్కొక్క చింపాంజీ ఒక తెల్ల బిళ్ళను ఆమిషన్‌లో పడేసి వెంటనే ద్రాక్షపండు పడే చోట చెయ్యి పెట్టుకు కూర్చునేది. ఎంతసేపటికీ ఆ పండు పడకపోతే, దానికి వళ్లు మండుకుపోయి, ఆ యంత్రాన్ని పట్టి కదిలించిపారేసేది. [పబ్లిక్ టెలిఫోన్ వుపయోగించే వారికి యీమాదిరి అనుభవాలు అవుతూ వుంటాయి. మనకి కావలసిన నెంబరుతో కనెక్షన్ రాకముందే, మనం పడేసిన రెండు అణాలు అందులో నుంచీ రాకుండా బిగుసుకుపోతాయి. అదే క్రొత్త వాళ్లు అయితే, ఆ టెలిఫోన్ రిసివర్ వూడి చేతులోకి వచ్చేదాకా, ఆ రెండు అణాలకోసం, దాన్ని పట్టుకు గుంజి, కొరికి, నమిలి, తన్ని యివతలకు వస్తారు.]

ఇంతవరకూ జరిగిన పరిశోధనల మూలంగా చింపాంజీలకు డబ్బు మీద మమకారం అయితే కల్పించవచ్చునని తేలిందికానీ, ఆ డబ్బు సంపాయించటంకోసం యివి ఎంతమటుకు కష్టపడి పనిచేస్తాయన్నది తెలుసుకోవలసి వున్నది. అందుకోసం ఆయన బలేచమత్కారమైన ఒక యంత్రాన్ని నిర్మించాడు.

ఆయంత్రంలో పెద్ద దూలం ఒకటి అమర్చి, ఏకోతి అయితే ఆ దూలాన్ని పైకి ఎత్తుతుందో, ఆకోతికి చక్కని ద్రాక్షపండు దొరికేలా చేశాడు. ఈపద్ధతి ఆచింపాంజీలకి బాగా అలవాటైనాక, దూలం ఎత్తగానే ద్రాక్షపండు కాక, తెల్లటి అట్టముక్క దొరికేలా చేశాడు. ఆ అట్టముక్కను పట్టుకుపోయి, మొదటి ఆ 'చింపో-మాట్' యంత్రంలో పడవేస్తే, ద్రాక్షపండు దొరుకుతుంది ఈపద్ధతి ఏర్పాటు చేసినందువల్ల, చింపాంజీ ప్రతిదీ ఒక్క ద్రాక్షపండు సంపాదించటం కోసం కొంతమటుకు చెమటోడ్చి పనిచేయాలి అందులోనూ ఆదూలం బరువు కూడా తక్కువలేదు- 18 పౌనులు! అయినానరే - ఆచింపాంజీలు కేవలమూ ఆ ద్రాక్షపళ్లను కొనిపెట్టే ఆటిక్కెట్ల కోసం, ఎంత శ్రమ అయినా పడ్డాయి. ఒకవంక యింత శ్రమపడి యీ దూలాన్ని అదే పనిగా ఎత్తుతూ దించుతూ తెల్ల టిక్కెట్లు సంపాదించు కొంటూ, అందుకోసమే ఎగబడిన మిగిలిన చింపాంజీలను కాలితోనూ చేతితోనూ చితక పొడవటం మొదలు పెట్టాయట.

ఆ యంత్రాన్ని అక్కడే కొద్ది రోజులపాటు పెట్టివుంచగా, యీ దిగువ విషయాలు కూడా బయటపడ్డాయట మొదట్లో తడవ తడవకీ దూలం పైకి ఎత్తి బయటికి వచ్చిన ప్రతి తెల్ల టిక్కెట్టునీ తీసి తెచ్చుకోవటం మానేసి, ఒకేసారి పది పదిహేనుసార్లు ఆదూలాన్ని పైకెత్తేసి, పది పదిహేను టిక్కెట్లూ ప్రోగయాక, ఆ పోగు వళంగా తీసుకుపోయి దాచిపెట్టుకోవటం మొదలు పెట్టాయి. బాగా ఒకవందకు పైగా యీ టిక్కెట్లు దాని చేతిలో చిక్కాక, యింకా ఎక్కువ సంపాదించుకోవాలనే ఆత్రం దానికి తగ్గిపోయింది. [మనుష్యుల్లోకూడా అంతే - ఎల్లాగో ఒకలాగు మొదటి వందరూపాయలు నిలువచేయగలిగేటంత వరకూ ప్రతివాడూ పగలూ రాత్రి అనక పనిచేస్తాడు. ఆ తరువాత అంతగా ప్రాకులాడడు ]

చేతిలో చిక్కిన ప్రతి టిక్కెట్టునీ వెంటనే ద్రాక్షపండుగా మార్చేసి తినేయాలన్న తొందర కూడా అన్ని చింపాంజీలలోనూ కనిపించ లేదు.

ఈ పరిశోధన లన్నీ పూర్తి అయ్యాక, డాక్టర్ జాన్ ఆ యంత్రంలో మరొక మార్పు చేశాడు. తెల్ల టిక్కెట్టు పడేస్తే ఆ మిషన్‌లోనుంచీ ఒక ద్రాక్షపండు రాలుతుంది ఇత్తడి బిళ్ళ పడేస్తే ఏమీ రాదు. నీలపురంగు బిళ్ళ పడేస్తే రెండు ద్రాక్షపళ్లు వచ్చేలా ఏర్పాటు చేశాడు. ఎర్రరంగు బిళ్ళ పడేస్తే గ్లాసుడు మంచినీళ్లు వచ్చేలా చేశాడు పసుపు పచ్చరంగు బిళ్ళ పడేస్తే, యీ డాక్టర్ జాన్‌గారే బోనులోకివచ్చి, ఆ చింపాంజీని తన వీపు మీద ఎక్కించుకు కాసేపు అటూ ఇటూ తిప్పేవాడు.

(43-ఎ పేజీ చూడండి)

# కవితాకుమారి

శ్రీ శ్రీ కృష్ణదేవ రాయలు రాజ్యం చేస్తున్న రోజులు. రాజ్యంలో ఏమూల చూచినా ప్రజలు సంతోషంగా కాలం గడుపుతున్నారు. ధర్మాన్ని పరిపాలించే రాజుగలడు, సిరి సంపదలు వుండగా వారికేమిలోటు! రాయలు రాజ్యతంత్ర ధురంధరుడు మాత్రమే కాదు. గొప్పకవి. అటువంటివాని జీవితంలో జరిగిన ఒక ఘట్టాన్ని గురించి చెప్పబోతున్నాను. ఆసంఘటన ఆయన 'ఆముక్త మాల్యద' అనే ఆ మహాకావ్యాన్ని వ్రాయక పూర్వం జరిగింది.

అది సాయం సమయము. పక్షులు తమ ఆహార సంపాదనకై తిరిగి తిరిగి విజయగర్వంతో గూళ్లకు చేరుకొంటున్నాయి రైతులు పగలంతా కష్టించి పొలాలలో పని చేసి, ఎద్దులను తోలుకొని యిళ్లకితిరిగి వస్తున్నారు

అలాటి సమయంలో సన్యాసి ఒకడు కాషాయ వస్త్రధారుడై, ఒకచేత కమండలము, మరియొక చేత మౌంజి ధరించి విజయనగరము దెసకే పోతున్నాడు. ఆవిధంగా పోయిపోయి నేరుగా రాయల కవితా మందిరం ప్రవేశించాడు.

రాయలు ఆతనికి నమస్కరించి ఆశని దీవనలను స్వీకరించి వచ్చిన కారణమడిగాడు సన్యాసి రాయలతో "నేను తీర్థయాత్రలు చేసే తలంపుతో బయలుదేరాను. కాని దారిమధ్యలో సుస్తీచేసింది. అందుచేత మాసమో, రెండు మాసాలో మీ ఆస్థానంలో విశ్రాంతి తీసుకో దలిచాను ప్రభువులవారు నాకు తగిన సదుపాయాలు చేయించవలసిందిగా ప్రార్థిస్తున్నాను" అన్నాడు. రాయలు అందుకు అంగీకరించాడు.

## శ్రీ మోక్షగుండము సుబ్రహ్మణ్యము

ఆమూడవ నాటికి రాయలు సన్యాసి ఒక గొప్ప కవియని గ్రహించాడు. ఆతనిచేత తన కుమార్తెకు సకల విద్యలూ నేర్పించవలెననే తలంపుతో ఆసన్యాసిని పిలిపించి, ఆ విషయము ప్రస్తావించాడు. సన్యాసి కూడా అందుకు సమ్మతించాడు

రాయలకుమార్తె పేరు అంబికాదేవి. నవయవ్వన విలాసిని ప్రౌఢ అవివాహిత. సూక్ష్మగ్రాహి ఆమె సన్యాసి శిక్షణలో కొన్ని రోజులలోనే గొప్ప పాండిత్యం అలవరచుకొన్నది. సన్యాసి ఆమెకు 'కవితా కుమారి'యని బిరుదు యిచ్చాడు.

రాయలొకసారి తన కూతురి పాండిత్యమును పరీక్షింప దలచి, కవితా మందిరంలో ప్రవేశించాడు కాలక్షేపానంతరము బిడ్డను ఏదైన ఒకదానినిగురించి వ్రాయమన్నారు. ఆమె తన గురువుఆజ్ఞతో పది నిముషములలో భార్యా భర్తల ప్రేమనుగురించి వ్రాసి తండ్రిచేతి కిచ్చింది. రాయలు దానిని తీసికొని మనసులో చదువుకొన సాగాడు. "భార్యా భర్తలు అన్యోన్యానురాగములు కలవారై ప్రేమతో మెలగవలెయును. భర్తసేవయే పరమావధియని భార్య తెలిసికొని యుండవలయును భర్త కౌగిలిలో నుండగా..." ఇక చదువలేక పోయాడు రాయలవారు.

అవివాహితమైనతనకుమార్తెకు భార్యా భర్తల ప్రేమ కలాపము ఎట్లా తెలిసిందాయని ఆలోచించాడు. ఏమీతోచక సన్యాసి ననుమానించాడు. ఇక అచట వుండలేక చివాలున లేచిపోయాడు.

సన్యాసి యిది అంతా గ్రహించి బాధపడ్డాడు. ఎట్లయినా తన నిర్దోషిత్వమును నిరూపించుకొని వెళ్లవలెనని పట్టు పట్టాడు. మరునాడు రాయలసభకు వెళ్లి "రాజా! నాకిపుడు ఆరోగ్యం బాగుపడింది. నేనువచ్చి యిప్పటికి మూడు నెలలైంది కాబట్టి యిక నా తీర్థయాత్రలకు పోతున్నాను" అన్నాడు

రాయలవారు బంగారు పళ్లెం నిండా రత్నాలు నాణేలూపోసి



# ★ కవితా కుమారి ★

తెచ్చి సన్యాసిని తీసికొనమని ప్రార్థించాడు. సన్యాసి వాటిని తీసుకొనక "రాజా! ఈ రత్నాలు కానుకలు సన్యాసినైన నాకెందుకు? మీకు అంతగా యివ్వాలని వుంటే నేనొకటి అడుగుతాను. ఇస్తారా?" అన్నాడు. రాయలు తప్పక యిస్తానన్నాడు.

అపుడు సన్యాసి రాయలతో "నీవు కూడా ఒక గొప్ప కవివే. కాబట్టి బీదవారి సంసార స్థితులను గురించి కొన్ని వాక్యములు వ్రాసి నాకు బహుమానంగా యియ్యి" మన్నాడు.

రాయలు పది నిమిషాలు ఆలోచించి ఏదో వ్రాసి సన్యాసిచేతికి యిచ్చాడు. అందులోని సారాంశమిది" "బీదవారు తినుటకు తిండి లేక, కట్టుటకు గుడ్డలేక బాధపడుచుందురు. పగలెల్ల కష్టపడి పని చేసి వచ్చిన ధనముతో కావలసిన వస్తువులు తెచ్చికొని తమ తమ జీవితములను గడుపుకొనుచుందురు. రాత్రి సమయమున తమ పూరి గుడిశెలలో రత్నదీపములు లేకపోవుటచే మట్టి ప్రతిమలలో ఆముదమునసహాయమునకొంచెము వెలుగునిచ్చు దీపములను వెలిగించుకొందరు. పగలు కష్టపడి పనిచేసి రాత్రి హాయిగా, సుఖముగా విశ్రమింతురు."

సన్యాసి అది చదివి, రాయలతో "రాజా! తమరు బీదవారి స్థితిని చాల బాగుగా, వున్నది వున్నట్లుగా వర్ణించి వ్రాశారు దీనినిబట్టి తమరు రాజవంశంలో పుట్టలేదని, ఏదారిద్ర్యభాగ్య దామోదరులకో పుట్టి అదృష్టవశాన రాజువైనావనీ నాకు తోస్తున్నది" అన్నాడు.

రాయల కోప మునకంతులేదు. ఆతని కుడిచేయి అప్రయత్నంగానే ఒరలోని కత్తి మీదకుపోయింది ఎలాగో కొంత తమాయించుకొని "మునీంద్రా! నాకుమార్తెకు విద్యాభిక్షపెట్టిన వారు కనుక, సరిపోయింది. వేరొకడు యివేమాటలని వుంటే ఈ వేళకు వాడి శిరస్సు వాడి మొండెమునుండి వేరైవుండేది బీదవారిని గురించి వ్రాయుటకు బీదల యింట పుట్ట పనిలేదు. వివికిడి

# గోపీ చేసిన గోల



[ఆదివారం ఉదయం 8 గంటల సమయం. గోపి, లక్ష్మి రీడింగు రూములో చదువుకొంటుంటారు. తల్లి వంట ఇంటిలో పని చూసుకొంటూ వుంటుంది.]

లక్ష్మి : [విసుగుతో పుస్తకము మూసి] అరే! గోపి, కేరమ్సు ఆడుదామ్రా!

గోపి : ఇప్పుడేగా నాన్నగారు బజారు వెళ్ళారు. మనం చదవటం లేదని, అమ్మ గనక నాన్నతో చెప్పిందీ అంటే, మన వళ్ళు చితక పొడుస్తాడు నాన్న. తెలుసా?

---

వల్లనూ పూహాలచేత కూడా అర్థం చేసుకొని వ్రాయవచ్చును" అన్నాడు.

అప్పుడు సన్యాసి నవ్వుతూ "రాజా! అయితే తమరు యిప్పుడు వినికిడివలన, పూహాలచేత బీదవారి స్థితి ఎట్లు వర్ణించారో, నిన్న మీ కుమార్తెకూడ అదే విధంగా వినికిడివల్ల, పూహచేత భార్యాభర్తల ప్రేమ కలాపమును గురించి వర్ణించింది. అది తెలుసుకోలేక, మమ్ముల ననుమానించారు. ఆమె తమరికే కాదు; నాకు కూడా బిడ్డతో సమానమే" అని చరచర వెళ్ళిపోయాడు. రాయలు పశ్చాత్తాపంతో తన్ను క్షమింపమని బిడ్డను వేడటానికి అంతఃపురంలోనికి వెళ్లాడు.



---

లక్ష్మి : నీవెప్పుడూ ఇంతేరా! 'అన్నీ చదివేశాం. లెక్కల హోంవర్కు పూర్తిగా చేసేశాం. చదవాలసింది ఇంకేమి లేదు' అని చెప్పేదాంరా.

గోపి : నాన్నగారు బజారు వెళ్లింది ఇప్పుడేగా. ఎట్లా మరి?



లక్ష్మి : [క్షణం ఆలోచించి] అరే! కేరమ్సు వద్దులేరా. ఆడుతున్నప్పుడు చప్పుడు అవుతుంది. అది విని అమ్మ కోప్పడుతుంది. ఒక్క ఆదివారంకూడా ఈ చదువు పీడ లేకుండా హాయిగా వుండటానికి వీలులేదుగదా! స్కూలు వున్న రోజులలోనూ చదువే: శెలవల్లోనూ చదువే అయితే బుర్ర పాడైపోతుంది. మొన్న పేపరులో నాన్నగారు చదివి వినిపించారు – ఎవరికో పాపం, బి. ఏ. చదువుతూ వుండగా పిచ్చెక్కిందట! ఎక్కువగా చదివితే మనకూ తప్పదురా ఆ పరిస్థితి.

గోపి : ఏ పరిస్థితే అక్కా?

లక్ష్మి : అదేరా పిచ్చి! అందుకనే P. O. ఆడుదామా?

గోపి : చీట్లపేకా?

లక్ష్మి : అవును రా. చీట్లు అయితే చప్పుడు చేయకుండా, గుట్టు చప్పుడు కాకుండా ఆడుకోవచ్చు.

గోపి : సెట్లు ఆట ఆడుదామా?

లక్ష్మి : కాదు; పట్లు ఆట ఆడుదాం!

గోపి : సరేలే అక్కా. చదువుకొనే చాపమీద ఆడుదాం. నాన్నగారు వస్తే వెంటనే చదువుతున్నట్లే నటించవచ్చు.

లక్ష్మి : అట్లాగేలేరా, రా... వెద్దాం.

గోపి : ఇంతకీ పేక ఎక్కడుందే?

లక్ష్మి : బీరువాలో ఉందో, మందుల అలమారాలో ఉందో! అమ్మనడిగి తాళాలు తెస్తాను. నువ్వు వెళ్ళి చదువుతున్నట్లు నటించు.

గోపి : మందుల అలమారాలో ఉందేమో చూస్తానే. అప్పుడప్పుడు నాన్న అక్కడ దాచి పెట్టుతుంటారు. [లక్ష్మి వంట గదిలోనికి వెళ్తుంది. గోపి మందుల అలమారాతీస్తాడు. దాన్నిండా హోమియోపతి మందు సీసాలుంటాయి. ఒకప్రక్క ఇంగ్లీషు మందు సీసా ఒకటి వుంటుంది.]

గోపి : అబ్బా! ఎంత తీయగా ఉంటాయి యీమాత్రలు! అబ్బా! అన్నీ పంచదారతో చేసిన మాత్రలు. అరే. ఇదేదో క్రొత్త



# ★ గోపి చేష్టలు ★

సీసాలాగా ఉందే!' ఇంత పెద్ద సీసాలో మందు మరీ తీయగా ఉంటుందేమో! రుచిచూసి అక్కతో చెప్తాను - క్రొత్త మందు సంగతి

[సీసాలోనుంచి చిటికెడు మందు తీసి నోట్లో వేసుకొంటాడు ఈలోగా లక్ష్మి వస్తూంది ]

లక్ష్మి ఏమిట్రా మందు వేసుకొంటున్నావ్?

గోపి ఈమందు తియ్యగా లేదే అక్కా! అన్ని మందులూ పంచదారలాగా తీయగా ఉంటాయ్ మరి ఇది చప్పగా ఉందే [ఆముదము [తాగినవాడిలా మొఖము పెట్టేశాడు ]

లక్ష్మి • [మందు లేబిల్ చూస్తుంది "పాయిజన్" అన్న ఇంగ్లీషు అక్షరాలు బిగ్గరగాచదివి] ఏరా, ఈ మందేనా తింటున్నావ్? చెప్పవేరా? అలా వెర్రి మొఖము పెడతావేరా?

గోపి [తెల్లబోయి చూస్తూ] అవును

లక్ష్మి అమ్మోయ్ వీడు విషం తిన్నాడేవ్ అయ్యొ ఎట్లాగురా? అమ్మా! అమ్మా! గోపిగాడు విషం తిన్నాడే! చవ్వనరావే! అయ్యో!

గోపి [భయపడి] అక్కా-ఏమిటో కడుపులో తిప్పుతోందే! తలకూడా తిరుగుతోందే దాహము వేస్తోందే మంచినీళ్లు .

లక్ష్మి తెస్తానుండురా! అమ్మా! అబ్బబ్బ! నిన్నేనే! మన గోపిగాడు విషం తిన్నాడే [ఏడుస్తూ చిందులు తొక్కుతూ వంటగదిలోకి పరుగెత్తుతుంది అరనిమిషం గడిచేలోగా లక్ష్మి, లక్ష్మితల్లి శారదా వస్తారు]

శారదా . అయ్యో! నాయనా! ఎందు కెళ్లావురా బీరువా దగ్గరకు? చదువుకొంటున్న వాడివి అక్కడి కెందుకు వెళ్లాల్సి వచ్చిందిరా నాయనా! [తల బాదుకొంటుంది ]

గోపి : అమ్మా-దా. హం వేస్తుందే [శారద వొళ్ళోకి తీసుకొంటుంది లక్ష్మి నీళ్లు తెచ్చియిస్తుంది ఈలోగా తండ్రి రామారావుగారు గదిలోకి ప్రవేశించి-]

రామా ఏమిటే ఈహంగామా అంతాను?

శారద ఇంకా హంగామా అంటున్నారా - కొంప మునిగిపోతేను? మన గోపి విషం త్రాగి స్పృహతప్పిపడిపోయాడు చూడండి ముందు మీరు వెళ్ళి వైద్యుణ్ణి పిలుచుకురండి అలా చూస్తారేం? వెళ్ళండీ!!

రామా • విషయ మేమిటే? ఎక్కడిదీ విషం?

శార ఎక్కడి దేమిటండీ! మందుల బీరువాలో తగలడిందట మన లక్ష్మి చదివి, అది విషమేనని

(5' -వ పేజీ చూడండి)

నేనీఊరు చదువుకు రావడానికి కారణమేమిటో తెలుసా? మా ఊరు పట్టి పల్లెటూరు. అక్కడో వీధిబడి తప్ప చదువుకు వేరే స్కూలు ఏదీ లేదు. ఆ వీధిబడిలో అయినా పిల్లలకి చదువుకంటె అల్లరే ఎక్కువ వస్తుంది. అందుకని మానాన్న నన్ను ఆబడికి పంపించ లేదు. తనకు పొలంలో పని లేనప్పుడు మానాన్న నన్ను తన దగ్గరే కూర్చో పెట్టుకుని చదువు చెప్పేవాడు.

ఎక్కాలు, పద్యాలు వప్ప చెప్పడమంటే నాకు వళ్లు మండి పోయేది. అదేం కర్మమో - ఎన్ని మార్లు చదివినా వచ్చేవి కావు!

ఒకనాడేం జరిగిందంటే మా నాన్న పన్నెండో ఎక్కం సాయంత్రంలోగా వప్పచెప్పక పోతే వళ్లు చీరేస్తానని చెప్పి, పొలం వెళ్లి పోయాడు. నాన్నచేత చివాట్లు దెబ్బలు లేకుండా చదువుకుందామని ఎంతో బుద్ధిగా పుస్తకం తెరిచాను. ఇలా రెండుమార్లు చదివేనో లేదో; మా జతగాళ్లంతా వచ్చి పడ్డారు. (మానాన్న ఎప్పుడు పొలం వెడతాడా అని పొంచి చూడ్డమే వాళ్లపని.) అంతే-సోము నాచేతిలో పుస్తకాలు లాగి అవతల పెట్టి మొదలెట్టాడు.

"ఒరే రామనాథాయ్! మరేం- మాంఛి ఆటరా! బలే బాగుంటుంది లేరా!"

"ఫొండి నే ఆడను. ఎక్కం రాకపోతే మానాన్న చంపేస్తాడు." అన్నాను చిరాకుగా.

"పోన్లే ఇంట్లో కూర్చుని అలాగే ఏడు! ఆనక మళ్లీ మాతో మాట్లాడవంటే చూస్కో, ఏం చేస్తానో - ఇప్పుడే చెప్తున్నా" అంటూ నన్ను బెదిరిస్తో వెళ్లి పోయాడు సోము.

వాడు మా పిల్లల ముఠాకి నాయకుడు. ఆరోజు వాళ్లంతా కొత్త రకం ఆట ఆడుకోడానికి ప్లాను వేసుకున్నారు. దాంట్లో నేనుంటే కాని వీల్లేని పరిస్థితి వాళ్లకు వచ్చి పడింది. వాడికోక్షణం వచ్చేటప్పటికి అక్కడవున్న పిల్లలందరికీ ఉత్సాహం చచ్చి పోయింది. రాముడు నాదగ్గరకు వచ్చి "రారా; ఆట అయింతర్వాత సాయంత్రం దాకా చదువుకుందూ గాని! చాలా బాగుంటుందిరా" అని బ్రతిమాలాడు. నేనుకూడా వాళ్లు నాజట్టెక్కడ మానేస్తారో అని భయపడుతూనే ఉన్నా నేమో, పుస్తకాలు మూలను పెట్టి వాళ్ల వెంట పడ్డాను.

"ఒరే సోమూ ఏం వాటరా? చెప్పవ్?" అని అడిగాను. సోము గాడికి కోపం అంతా పోయింది. ఎవడికోసం పోదూ?- వాళ్లాడే ఆట, నే లేకపోతే జరగనే జరగదు. ఎంచేతంటే - ఆడపిల్లల కున్నట్టు పొడుగాటి జుట్టు నాకే ఉన్నది- మామురా అందర్లోకి!

ఆమధ్య కరణంగారింట్లో పెళ్లయింది. ఆపెళ్లికి బోగం మేళం వచ్చింది. ఆమూడు రోజులూ మా పిల్లమూకంతా వాళ్ల వెంటే తిరిగాం. వాళ్లు సభలో అభినయం చేసినప్పుడూ, ఊళ్లో ఊరేగినప్పుడూ, వాళ్లముందు ప్రేక్షకులం మేమే. అంచేత వాళ్లు పాడే పాటలు, చేసే అభినయమూ మాకు క్షుణ్ణంగా వచ్చేశాయి. (నాకు అదేం ఖర్మమో - ఎక్కాలు తప్ప అన్నీ ఇట్టే వచ్చేస్తాయి సుమండీ!) ఆరోజు ఆబోగంపాట ఆడాలని మా సోము నిర్ణయం చేశాడు.

"ఒరే అడ్డానికీ, చేతులు తిప్పకోడానికీ నివ్వే పనికొస్తావురా! నీకు జడకూడా ఉంది!" అన్నాడు. ముఖ్య పాత్ర నాకిచ్చినందుకు నాకెంతో గర్వంగా ఉన్నది.

"ఓ, తప్పకుండా, నేనే ఆవేషం వేస్తాను! నాకు పాటలు కూడా వచ్చేశాయి. సరే కాని...మరీ... కాళ్లకి గజ్జెలెలారా?"

పెద్ద సమస్యే! అందరూ ఆలో



# ★ రామనాథాయ్ ★

టల్లో పెట్టారు. అంతలో వెంకి గాడికో ఆలోచన తట్టింది–ఎండు జిలపకాయలు తెచ్చి దారానికి గుచ్చి కాళ్లకు కట్టుకుంటే 'గల్' 'గల్' మంటాయని. ఇన్ని జిలప కాయలు తెచ్చి గుచ్చి కాళ్లకు కట్టాడు. చికిలింత వెన్నెలతో చెవులకి, చేతులకి నగలు పెట్టకోవచ్చు-మా చెల్లెలు రవిణీ పరికిణీ, జాకెట్టు చాటుగా పట్టుకొచ్చా.

ఇక నేం – మామూలుగా అంతా మాదొడ్లో పశువుల సావిట్లోకి చేరాం. సరిగ్గా నేను వేషం వేసుకునే టప్పటికి ఎక్కణ్ణించి ఊడి పడిందో మారవిణి–"ఒరే; నా పరికిణీ కట్టుకున్నా వేంరా?" అని కేకే సింది.

"మేమాడు కుంటున్నామే"

"ఏం ఆటరా అన్నయ్యా?"

"అప్పుడూ... పెళ్లిలో భోగం వాళ్లాడేరే, ఆ ఆట."

"ఒరే, నేనూ ఆడొద్దురా?"

"ఛా ఛా! తప్పు! నువ్వింటోకి పో."

"ఆఁ ఆఁ నేను పోనూ, ఊఁ ఊఁ, నేనూ ఆడతా,"

మాసోమిగాడికి వళ్లు మండింది–"ఏయ్ పోతావా? రెండిచ్చుకో మన్నావా?" అని రయ్ మన్నాడు.

రవిణి ఏడుస్తూ ఇంట్లోకి పోయింది. అది యింట్లోకిపోయి ఏం బెడద తెచ్చిపెడుతుందో అని నాకు లోపల దిగులుగానే ఉన్నది, చెప్పొద్దూ! అయినా అప్పటికప్పుడే ఆటకి సరంజాం అంతా పూర్తయింది. నా వెనక నలుగురు కుఱ్ఱాళ్లు చిల్ల పెంకుల తాళాల్లా వాయించ డానికి ఏర్పాటయింది. ఒకడు వెదురుబద్ద ఒకటి ఫిడేల్లా పట్టుకుని, ఇంకో వెదురుపుల్ల కమానుతో ఓ పక్కగా నిలబడ్డాడు. మా సోములు పాతడబ్బా ఒకటి మద్దెలకి సిద్ధం చేసుకున్నాడు. నేను ఆడే స్థలానికి ముందరగావచ్చి వంగి జిలపకాయ గజ్జలు సరిచేసుకుని సభకి నమస్కారం చేసేను. సభంటే మనుష్యులెవరున్నారు? ఆసాళ గుంజలూ, తట్టలు, బుట్టలు, పొలానికి వెళ్లని ఆవు దూడలూ, గేదె దూడలూ! ఇవేమా సభికులు. మాసోమిగాడు పాట అందించాడు.

"ఈ ..రా.. జా...సా...భలో"

మొదటి కాలంలో పాట

మొదలయింది. వెనక కుఱ్ఱాళ్లు పాటకి సరిగా 'టిక్కు' 'టిక్కు' తాళాలు వేస్తున్నారు. సోమిగాడు పాతడబ్బా 'ధన్' 'ధన్' మని పిస్తున్నాడు. నేను కుడికాలు ముందుకీ వెనకాల్లు వెనక్కీ పెట్టి, ఎడమచెయ్యి నడ్డిని పెట్టి, కుడిచెయ్యి చాపి ఎడమనుంచి కుడికి లాగుతూ సభవారి నుద్దేశించి పాడుతూ చక్కగా ఆడేను మా సోమిగాడు మద్దెల కొడుతూ తల తిప్పుతూ 'బలే! బలే' అని "ఈ... మా.. ళీ...కా.. ట్రైడన్"' అందించాడు.

అందరూ కలిసి 'ఈ...మా... ళీ...కా...ట్రైడన్'' అన్నారు.

సోములు రెండో కాలంలో పాట అందుకున్నాడు.

"ఈ... రా... జా ... సా... భలో — ఈ...మా...ళీ...కా... ట్రైడన్ ..."

ఇలా రెండుమూడు మార్లయిన తరువాత సభకి నమస్కారం చేస్తూ గమ్మున కూర్చోవాలి (శాస్త్రం ప్రకారం!) నేనామాట మర్చిపోయి ఇంకా జడ ఆడించుకుంటూ ఎగురుతూనే ఉన్నాను ఇంతలో మా సోమిగాడు "ఓరి చవట వెధవా! ఇంకకూర్చొని ఆడరా, యీ పాటికి" అని వీపుమీదో గుద్దు గుద్దాడు. నాకు వళ్లు మండింది.

"షా, వెధవ గొప్ప: నే ఆడనే ఆడను" కాళ్లకు కట్టిన గజ్జలు విప్పేయ బోయాను.

"ఒరే! ఒరే! మానేనెయకురా. ఆట పూర్తి కానీరా" రాముడు, వెంకిగాడు బతిమాలారు.

"ఇంకేమిా అన్నా! ఆటలో అరిటిపండు. మర్చిపోయి కొట్టాను" సోములు క్షమార్పణ చెప్పుకున్నాడు. తిరిగి ఎక్కడి వాళ్లం అక్కడ సద్దుకున్నాము. ఈమాటు సోమిగాడి కంటె నేనే ముందుపాట అందుకున్నాను-ఆడేది నేనయితే వాడి పెత్తన మేమిటి-బోడి పెత్తనం!

"దో...న...కా...రిమా...ట. లా...డి. మో...న...పు...చ్చుట, న్యా...య. మా..." పాట సాగదీస్తూ పాడేను. దీర్ఘం ఉన్నమాట దగ్గిరల్లా చిల్ల పెంకులు మోగుతున్నాయి. వెధవ సోమిగాడు చచ్చినట్టు డబ్బా వాయిస్తున్నాడు! తానేమో పొడుచుకొచ్చి నట్లు అందరిమీాదా అధికారం చలాయించటానికి వాడికేమన్నా జడ ఉందా? తిరుపతి మొక్కుందా? ఏడుకొండల వాడి ధర్మమా అని ఆవేళ నేనే మామురాకి నాయకుణ్ణయాను.

."దో న కా ...రి మా.. ట. లా డి మో న పు చ్చు ట. న్యాయమా, బాసచేసి దాటకురా గా సి చెం ది నా నునానుర, నే గాసిచెందినానురా"

పాట తారస్థాయిని మూడో కాలంలో పాడేస్తున్నాము. నేను శివమెత్తినట్టు అన్ని దిక్కులకు తిరిగి ఆడేస్తున్నాను.

ఉన్నట్టుండి సోమిగాడు డబ్బా వదిలి పరుగు లంకించుకున్నాడు. ఇదేమా అని చూద్దునుగదా! మిగతా పిల్లలందరూ తలోదారిని పరుగెత్తుతున్నారు. మానాన్న ప్రళయరుద్రుడిలా ఓ చేత్తో నాజడలంకించుకుని, రెండోచేత్తో నాచెంప ఛెళ్లుమనిపించాడు నా తల తిరిగి పోయింది. కళ్లు చీకట్లు కమ్మాయి.

వళ్లు తెలిసి చూసేప్పటికి మా అమ్మ నన్ను పట్టుకుని సవిరిస్తూ నావేషం వూడ తీసేస్తోంది. మా నాన్న రొప్పుతూ బల్లమీాద కూర్చున్నాడు. ఇంట్లో కెలా వచ్చానో నాకే తెలియదు!

"ఇంట్లో కూర్చున్నవాణ్ణి వుండనివ్వరుగదా! దిక్కుమాలిన వాళ్లు. యమములాళ్లలా వచ్చి పడతారు వెధవసంతు" - మా అమ్మ ఊళ్లో పిల్లల్ని ఆడి పోసుకొంటోంది.

"మన వెధవకి బుద్ధిలేకపోగా వాళ్లనెందుకు అనడం? చదువుకోరా వెధవా, అంటే తెయితక్క లాడతాడా? ఏడిరోగం ఇలా కాదు. ఒరే! నువ్వు పన్నెండో ఎక్కం, పద్యం, ఆ రెండో ఇంగ్లీషు పాఠం వప్పచెప్తేనే ఇవాళ ఇంట్లో అన్నం పెట్టడం. తెలిసిందా? ఊ! జాగ్రత్త!" మానాన్న శిక్ష విధించి మళ్లీ షాలం వెళ్లిపోయాడు. ఇదంతా మా చుప్పనాతి రవిశిపనే అయుంటుంది. లేకపోతే దొడ్లో ఎక్కడో వున్న మాసంగతి నాన్నకెలా తెలుస్తుంది?

మానాన్న బాగా చీకటిపడ్డ తరవాత ఇంటికి వచ్చాడు వస్తూనే భోజనంచేసి, నన్ను పిలిచాడు. ఎక్కాల పుస్తకం తీసుకుని బిక్కు, బిక్కు మంటూ ఆయన దగ్గిరకు పోయాను. ఆయనకు మధ్యాహ్నం వచ్చిన కోపం కొంచెం తగ్గింది కాబోలు-యిప్పటికి కొంచెం ప్రసన్నంగాఉన్నాడు. నేను పన్నెండో ఎక్కం తడుముకుంటూ మొదలు పెట్టాను.

# ★ రామనాథాయ్ ★

"ఒహో పన్నెండు పన్నెండూ. రెండు పన్నెండ్లిరవై నాలుగూ. మూడుపన్నెండ్లు! మూడుపన్నెండ్లు ముప్ఫైయ్యారూ. నాలుగు పన్నెండ్లు నలభైయెనిమిదీ ఐదు పన్నెండ్లరవై" ఇంతవరకూ బాగానే వచ్చింది. ఇక ఆతరువాతనే వున్నది గండం అంతాను.

"ఊఁ తరవాత?" గుడ్లెఱ్ఱచేస్తూ అన్నాడు నాన్న.

"ఐదు పన్నెండ్లరవై ఆరు పన్నెండ్లు! ఆరుపన్నెండ్లు! ఆరు- ఆరు పన్నెండ్లిరవైమూడు—"

అంతే - మా నాన్న ఉగ్రుడై పోయాడు. "ఓరి వెధవా! తప్పు చెప్పటానిక్కూడా అంత ఆలస్యమెందుకురా? ఆరుపన్నెండ్లిరవై మూడనడానికి అంత సేపాలోచించి ఏడవాలా?" అని ఓ మొట్టికాయ ఇచ్చుకున్నాడు. తప్పు చదవటానికి ఆలస్యమూ, ఆలోచనా అవసరం లేదనే సంగతి నాకు ఆ మొట్టికాయతో పాటు అప్పుడే బుఱ్ఱకెక్కింది.

"సరే. పద్యమేనా వచ్చిందా?" అని అడిగాడు నేను సమాధానం చెప్పకుండా తెలుగు పుస్తకం చేతికిచ్చాను.

"ఊ!—కానీ" అన్నాడు మా నాన్న.

నేను భయపడుతూ, ఏడుకొండల వెంకటరమణ మూర్తికి మనస్సులో దణ్ణంపెట్టి, పద్యం మొదలుపెట్టాను.

"ఎలుకతోలు తెచ్చి ఎన్నాళ్లు- కాదు ఎలుక, అహ కాదు, కాదు, 'తోలు ఎలుక తెచ్చి ఎన్నాళ్లు తోమినా!' అరె! మర్చిపోయాను ఇందాక వచ్చినట్టేవుంది! ఛీ, వెధవది- ఆఁ అమ్మయ్య-ఎలుకతోలు తెచ్చి ఎందాక ఉతికినా, తెలుపు తెలుపే కాని నలుపుకాదు; పురుషులందు పుణ్యపురుషులు వేరయా విశ్వదాభిరామ వినురవేమా"-చివర కాస్త రాగం కూడ తీసేను - ఎందుకైనా మంచిదని.

మానాన్న ముఖంలో అనేక రంగులు ఫిరాయించాయి - ఆయన నవ్వే ఆపుకున్నాడో, కోపమే ఆపుకున్నాడో నాకిప్పటికీ తెలియదు.

"ఇదేవిటిరా? గాడిదా! ఒక పద్యంలో పాదం పట్టకొచ్చి యింకో పద్యంలో తగిలించావు?" అన్నాడు. నేను జంకుతూ "నాన్నా మరీ, నువ్వేకాదు - ఎల్లాగా రాని దానికి ఆలస్యం కూడా ఎందుకన్నావు? అందుకని నాకు వచ్చిందేదో గబగబా చదివేశాను—" అన్నాను నా సమాధానం విని మానాన్న మండిపడి పోయాడు. "ఓరి దౌర్భాగ్యుడా!" అని మీదకు వచ్చేసరికి మాఅమ్మ అడ్డు పడింది.

"అలా హిరణ్యకశిపుడై పోతే పిల్లాడు బతకాలా అక్కర్లేదా? చాల్లెండి, మీప్రజ్ఞ! చెప్పేరు సతుకు!! దా బాబూ దా! అన్నం పెడతాను"

మాఅమ్మ నన్ను పెరట్లోకి తీసుకెళ్లి ముఖం కడిగి, మంచి గడ్డ పెరుగుపోసి అన్నం పెట్టింది.

"శ్రద్ధగా చదివితే పారం వచ్చేస్తుందిక దరా! నాన్నగారిచేత దెబ్బలెందుకు తింటావు చెప్పు?" అంటూ ఎంతో ప్రేమగా నావీపు తడుముతో అడిగింది.

"అది కాదే అమ్మా! నాకు ఇంగ్లీషు పారం కంఠతా వచ్చిందే. ఎక్కం, పద్యం, బాగా రాలేదు కాని-కావలిస్తే ఇంగ్లీషు పాఠం ఇప్పుడు గడ, గడ వప్పచెప్పేస్తాను." అన్నాను నాభోజనమయింది. మాఅమ్మ నన్నుకూడా తీసుకుని మానాన్న వద్దకు వచ్చి "చూడండి; పిల్లాడిని కాస్త బుజ్జగించి చెప్పాలి కానీ, బెదర కొట్టేస్తే వచ్చింది కూడా మర్చిపోతాడు కుఱ్ఱ కుంక. వీడికి ఇంగ్లీషు పారం అంతా వచ్చిందిట. వప్పచెప్పుకుని కొత్తది చెప్పండి" అన్నది.

"ఏరా, వచ్చిందా" మానాన్న అడిగాడు. నేను తల తిప్పాను.

"ఐతే చదువు."

"దీజ్ ఆర్ పెన్సిల్స్, దీజ్ ఆర్ త్రీపెన్సిల్స్=ఇవిమూడుపెన్సళ్లూ. దోజ్ ఆర్ బుక్స్, దోజ్ ఆర్ ఫోర్ బుక్స్=అవి నాలుగుపుస్తకములూ" తడుముకోకుండ చదివాను. మానాన్న ముఖం వికసిచింది. నాకెంతో గర్వంగా ఉంది. నాకెదురుగా ముందర దొడ్లో, కొబ్బరి చెట్లకింద నెమరు వేస్తున్న మాఆవులు కనిపించాయి, నా పాండిత్యం మా నాన్నకి చూపించాలని పుస్తకంలో లేని వాక్యాలు కూడా చదివాను.

"వోజ్ ఆర్ కౌస్=అవి ఆవులూ దీజ్ ఆర్ చెట్స్. అవి—

"చెట్స్ మిటిరోయ్?!"

"అవి చెట్లూ."

"చాలా బాగుంది! సరేకాని, దీజార్ చెట్సని అవి చెట్లంటావేమిట్రా? చెవల వెధవా!"

“పుస్తకంలో అలాగే ఉంది నాన్నా!”

“ఎలా ఉంది?”

“ఓమాటు ‘దోజారంటె’ ఇంకో మాటు ‘దీజార’నాలి. ఇంకా కావలిస్తే చూడు?

“నీ మొహం, నీ బొందాను! పోయిపడుకో ఈ పాటికి” మా నాన్నకు వళ్లుమండి పుస్తకం విసిరేశాడు. నాకు అంతకంటే వళ్లు మండింది. ఇంత చక్కగా చదివినా కూడా ఇంకా ఎందుకో ఆక్షేపం? మాట్లాడకుండ పోయి పడుకున్నాను.

మానాన్న మా అమ్మతో అంటున్న మాటలు ముసుగులోంచి వింటున్నాను. “ఇదిగో వీడిని గుమ్మందాటి వీధిలోకి వెళ్లనిచ్చినా, వీధిలో కుఱ్ఱాళ్లని ఇంట్లోకి రానిచ్చినా, వాడికి కాదు శిక్ష; నీకే తెలిసిందా?”

అమర్నాడు నాకు గట్టికట్టుబాటు చేసింది మాఅమ్మ నేను మాఇంట్లోంచి కదలటానికి వీల్లేదు, మధ్యాహ్నం దాకా పాఠాలు చదివాను. ఏమీ తోచదు. ఎంతసేపని మారవిణితో ఆడుకోడం? మధ్యాహ్నం అందరూ పడకలు వేశారు. నేను మా అమ్మని బతిమాలేను

“అమ్మా! వీధిలోకి ఎక్కడికీ వెళ్ల నే, దొడ్లో ఆడుకుంటానే ఏమే వెళ్లొద్దా?

“వద్దు. ఎండ మండిపోతోంది” మాఅమ్మ కళ్లు తెరవకుండా నే జవాబు చెప్పింది.

“అమ్మా, చెట్లకింద నీడలో ఆడుకుంటూనే. ఎండిలోకి వెళ్లనే. ఏమే, అమ్మా! వెళ్లొద్దా?”

“ఆ. వెడితే వెళ్లరా గోల”మా అమ్మ నిద్దర మత్తులో నన్ను విదిలించి పారేసింది. అంతే-నేనొక్క పరుగుతీశాను దొడ్లోకి. మాదొడ్లో పెద్ద రేగి చెట్టొకటుంది. దానిమీద కాకులు గూడుకట్టి గుడ్లుపెట్టాయి.

# ★ రామనాథాయ్ ★

సాకా గుడ్లని చూడాలని ఎన్నాళ్ల నుంచో వున్నది. ఎప్పుడు చూద్దామన్నా, ఓకాకి అక్కడ కాపలా వుండేది. చెట్టుకింది కెవరయినా వస్తే చాలు, 'కా' 'కా' అని అరుస్తూ నెత్తిమీద తన్నేది! ఆరోజు నేను దొడ్లోకి వెళ్ళేటప్పటికి ఒక్క కాకికూడా చెట్టు మీదలేదు. గుడ్లు పిల్లలయాయో లేదో చూడ్డానికి మంచి అవకాశం దొరికింది

నేను నెమ్మదిగా ముల్లు గుచ్చుకోకుండా, చెట్టుఎక్కి గూడు సమీపించాను. ఎక్కడి నుంచి వచ్చాయో, ఎలా పసికట్టాయో తెలియదు - రెండు కాకులు అగుస్తూ వచ్చి నన్ను చుట్టేశాయి. నాకు వెఱ్ఱిభయం వేసింది ముల్లు గుచ్చుకోకుండా చూచుకుంటూ, నెమ్మదిగా దిగి పోతున్నాను. ఇంతలో ఓకాకి నానెత్తిమీద ఫెడేల్‌మని తన్నింది. అసలే గజ, గజా, వణుకుతున్నా నేమో - నా చెయ్యి కాస్తా పట్టుజారింది. గావు కేక పెట్టి కింద పడిపోయాను.

మాఅమ్మ ఒక్క పరుగుని ఇంట్లోంచి వచ్చింది. వళ్లు గీసుకుపోయి రక్తం చిమ్మింది, కాలు మునిగిపోయి శీలమండలో ఇరుకు పెట్టింది మాఅమ్మ ఎత్తుకుని ఇంట్లోకి తీసుకువచ్చింది. నాకాలు బాగా వాచిపోయింది. ఆటలు లేవు సరిగదా, ఒక్క అడుగేనా కదలడానికి కూడా వీలులేకుండా పోయింది. నా అవస్థ ఏం చెప్పను? మంచం దగ్గరే భోజనం.

రెండు రోజులకి నొప్పి కొంచెం తగ్గింది కానీ,నడవడానికి మాత్రం స్వాధీనం కాలేదు మంచం మీదేం తోస్తుంది? మాఅమ్మ మారవిణిని, నన్నూ ఆడుకుంటూ కూర్చోమని వైకుంఠపాళీ, గవ్వలూ పడేసింది. ఆఆట ఏం బాగుంటుందనీ, వెధవ పెద్దపాము నోట్లోపడడం, కోతి దగ్గరికి దిగి కూర్చోటం! రెండు మూడు మార్లాడేసరికి నాక సహ్యంవేసింది. మరిం కెలాగ కాల క్షేపం? బాగా ఆలోచించాను. మంచిఆట ఒకటి తోచింది.

"ఒసే చెల్లెమ్మా, ఈఆట బాగుండలేదు నువ్వు నేచెప్పిన ఆట ఆడతావా?"

"ఏమాట?"

"ఆడతానంటే చెప్తాను"

"ఓ తప్పకుండ ఆడతాను"

"ఇదిగో, జాగ్రత్తగా విను. నేనేమో, మరీ, శేషమ్మ బామ్మగారినిట; నువ్వేమో, వాళ్లింటి కొచ్చిన చుట్టానివిట; ఏం?"

"ఓ! బలే, బలే, చాలా బాగుంటుందిరా: తప్పకుండా ఆడతాను. ఒరే, మరీ-నీకు గుండేదిరా?

"నా కానిమిషంలో నాజుట్టు చూస్తే ఒళ్లు మండుకొచ్చింది. ఐనా మా రవిణిని డబాయించేను. "వెధవ తెలివి? ముసుగేసుకున్నాక జుట్టెలా కనిపిస్తుందే?"

"ఐతే నేనే శేషమ్మ బామ్మ నవుతాను. నువ్వే చుట్టానివి"

నాకు మారవిణి మీద చెడ్డ కోపం వచ్చేసింది. మరోప్పుడైతే వీపు మీదోటి అంటించేవాడిని. అప్పటి నాస్థితినిబట్టి మంచి మాట ఆడవలసి వచ్చింది.

"ఇదిగో, చూడు. చెల్లెమ్మా! మొదట నేనేమో బామ్మవేషం వేస్తాను. ఆతరవాత, రేపేమో, నువ్వేద్దువుగాని. ఏం? మరి నేను పెద్దాణ్ణి కదూ?"

మారవిణి, ఏకళనుందో ఏమో, వప్పుకుంది. నాకు మానాన్న తెల్ల పంచ తెచ్చి యిచ్చింది. నేనాపంచ చక్కగా నెత్తిమీదికి ముసుగు వచ్చేటట్టు కట్టుకున్నాను. మా రవిణి, మానాన్న కండువా పమి టేసుకుని మొహాన్నింత కుంకం మెత్తుకుని తయారయింది.

"ఏం? ఇంక మొదలెడదామా?"

"ఊఁ"

అది చేతిసంచీ ఓటి పుచ్చుకుని వీధి గుమ్మం దగ్గిరనుంచి తిన్నగా నావద్దకు వచ్చింది నేను దాని మొహం చూస్తూనే దొడ్లోవున్న మాఅమ్మకి వినిపించకుండ మొదలెట్టాను ఏడుపు.

"ఓయి దేముడోయ్! ఓయి దేముడా! నాకెంత గతి తెచ్చిపెట్టావురా? దేముడోయ్ — దేముడా! ముక్కు చీదేశాను. మారవిణి చేతి సంచి కిందపెట్టి, నాదగ్గిరకి వచ్చి కూర్చుని - "ఊరుకోండి వదినా! ఊరుకోండి. ఏం చేస్తాం?"

"ఈ అవస్థకూడా ఉందనుకో లేదో. అయ్యో దేముడా!

"వదినా! విచారించి యేం లాభం? ఆయనకేం మహరాజు. వెళ్లిపోయారు."

నేను దుఃఖం పట్టలేనట్లు ముక్కు చీదేస్తూ అందరూ వింటారన్న

మాట మర్చిపోయి ఏడుపు శృతి పెంచేశాను.

"అందరి ఆయువు పోసుకు బతుకుతున్నానోయ్ దేవు—"

అంతే నా యేడుపు కట్టడి పోయింది. మాఅమ్మ దొడ్లోనుంచి పరిగెత్తుకు చక్కా వచ్చింది. మాఆట ఇంకా పూర్తిఅవనే లేదు. ఏడుపు స్వరంతో నేను చెప్పవలసిన మాటలు ఇంకా చెప్పనే లేరు!

అసలు సంగతేమిటంటే మా పక్క ఇంట్లోనే మా పురోహితుడు గారున్నారు. ఆయన తండ్రి ముసలి వగ్గు. రెండేళ్లనుంచి పక్షవాతంతో మంచంమీదే వుండి ఓ నాడు టపా కట్టేశాడు. ఆయనభార్యకి, ఆయనకి పదేళ్లనుంచి మాటలులేక పోయినా, ఆవిడమాత్రం యథా విధిగా ఏడ్చేది. ఆవిడ అల్లా ఏడ్పు మొదలెట్టేసరికి, నేనిలా మాగోడ మీద యెక్కి కూర్చునే వాడిని. అక్కడ వాళ్లింట్లో ఏడుపు పూర్తయ్యాక కానీ గోడ దిగేవాడిని కాదు. గోడమీద నుంచి చూస్తే వాళ్లింట్లో అన్నీ కనిపిస్తాయి. నాకావిడ ఏడుపంతా వచ్చేసింది. ఎక్కడ చీదాలో, ఎక్కడ వెక్కాలో నాకు బాగా తెలుసు - కాని, ఏం లాభం! మధ్యలో మాఅమ్మ వచ్చేసింది. వచ్చేసి ఊరుకున్నదా?

"ఓరి వెధవల్లారా! ఏం చేటు కాలం వచ్చిందర్రా? - నిండింట్లో కూర్చుని" అని నన్నో రెండు, మారవిణి నో రెండు అంటించింది. నేను హడలిపోతున్నాను ఈసంగతి మానాన్నకి తెలిస్తే ఏం చేసిపోతాడో అని!

కాని మానాన్న నన్నేమీ అనలేదు. ఆమర్నాడు నాజుట్టు తీయించేసి భద్రంగా తిరుపతి పంపించి, నన్నీ ఊరు, మాపిన్ని దగ్గిరకి, చదువుకు పంపించాడు. ఇదీ, నాసంగతి.

★

# జంతుకోటిలో మానవలక్షణాలు

(32-వ పేజీ తరువాయి)

ఈమాదిరిగా ఫలాని రకం, ఫలానిరంగు బిళ్ల పడేస్తే ఫలాని ఫలానివి వస్తాయనే జ్ఞానం జంతువులకి అంత తేలికగా అలవడదేమో అనుకొంటాం. మన పిల్లవాడు, కానీ కోసం గోలచేసినప్పుడు, మన దగ్గిర చిల్లరలేక అణాయిస్తా మనుకోండి. కానీ కంటే అణాకే ఎక్కువ పప్పరమెంట్లు వస్తాయని మనం ఎంత చెప్పినా, తానడిగిన కానీ కంటే యిది చిన్నదనే కారణంచేత వాడు, తనను మనమేదో మోసం చెయ్యబోతున్నా మనుకొంటాడు కదా!

అట్లాంటిది యీ చింపాంజీలు యీ రకరకాల బిళ్లలకు విలువల్లో గల తేడాలు తెలుసుకోగలిగాయి. ఆవిషయం ఎలా బుజువైందీ అంటే-ఒక రోజున ఒక చింపాంజీ తెల్ల టిక్కెట్లు సంపాదించుకోవటంలో ప్రపంచాన్ని మరచివున్న సమయంలో వెనగ్గా పోయి యీ డాక్టర్ జాన్‌గారు ఎలిక పిల్లను వదిలిపెట్టారు. సహజంగా చింపాంజీలకి ఎలుక లంటే మహా చెడ్డ భయం [అన్నీల మిన్నలు అయిన మానవాంగనల వలెనే!] ఆ చింపాంజీ కూడా ఆఎలకను చూసి మహా బెదిరిపోయి, బోనులో అన్ని మూలలకీ పోయి దాక్కోబోయింది. ఏమూల నక్కినా ఆఎలుక మీది మీదికి వస్తూవుంటే, దానికి దిక్కు తోచలేదు. క్షణం ఆలోచించి, పచ్చ టిక్కెట్టు పట్టుకొచ్చి ఆమిషన్‌లో పడేసింది.

లోగడ జరిగిన ఏర్పాటు ప్రకారం పచ్చటిక్కెట్టు మిషన్‌లో పడగానే యీడాక్టరుగారు చింపాంజీని తన మూపులమీదికి ఎక్కించుకు తిరగాలికదా! ఈయనకు తప్పలేదు. వొంగున్నాడు. చింపాంజీ ఒక్క వుదుటున పోయి ఆయన భుజాల మీద ఎక్కి కూర్చొని, తన నక్కడినుంచీ చప్పున బయటకు తీసుకుపొమ్మన్నట్లు ఆయనను పట్టుకు గుర్రాన్ని బాదినట్లు బాదటం మొదలు పెట్టింది.

ఇదంతా చదవటానికి వికటానికి బాగానే వుండి కానీ, డబ్బును గూర్చిన మమకారం ఎప్పుడైతే ఆ జంతువులో ప్రవేశపెట్టామో, అప్పటినుంచీ అవి కూడా మనలాగే కాపీనాన్ని పెంచుకొని, ఒకదాన్ని ఒకటి మోసం చేసుకోవటం మొదలుపెట్టాయని తెలిసిన తరువాత మాత్రం కొద్దిగా బాధ కలుగుతోంది.

(ఇంకా వుంది)

★



"సరోజను తీసుకొచ్చి మీముందు కూర్చోపెడతాను," అని రేఖ చెబుతుంటె
శ్యామ్ నిర్ఘాంత పోతున్నాడు రోహిణీవారి 9 వ చిత్రం "[illegible]"లో జమున, రామారావు



రోహిణీవారి 9 వ చిత్రం "లాఖా-చీ-గోష్ట్" అనే మరాఠీ చిత్రానువాదం షూటింగ్ దృశ్యం. ఎడమనుంచి వరసగా పాత్రధారులు శివరాం, యన్. టి. రామారావు, జానకి, జమున ఈ సంపూర్ణ హాస్యచిత్రాన్ని శ్రీ కె. ఆర్. స్వామి డైరెక్టు చేస్తున్నారు శ్రీ హెచ్. యం. రెడ్డి పర్యవేక్షణ కెమేరా అన్నయ్య (డి. యల్. నారాయణ)

# అదీ - ఇదీ

గడచిన మూడు మాసాల్లో తొమ్మిది తెలుగు చిత్రాలు, పట్టున పెంకు మూతేసి చెప్పిన విడుదల అయ్యాయి "అమ్మలక్కలు" "గుమాస్తా" చిత్రాలు రెండురోజుల తేడాతో వెలువడ్డాయి ఇలా వారం కూడా తిరక్కముందే చిత్రాలు విడుదల చేయటంవల్ల ఎవరికీ లాభం జరగటం లేదన్న విషయం అందరూ గుర్తించారు అయినా నిర్మాతలు, డిస్ట్రిబ్యూటర్లు ఈ విషయంలో సరియైన చర్యలు తీసుకొంటున్నట్లు కనబడదు నాలుగు వారాలు పోటీలేకుండా నడిచే చిత్రానికి సరిగా గిట్టుబాటు కావటంలేదనీ, పూర్వంలాగ సినిమాలకు డబ్బు వెచ్చించటానికి ప్రజలు వెనుకంజవేస్తున్నారనీ, నూటికి 40 వంతుల దాకా రాబడి తగ్గిపోయిందని అంటున్నారు ఇటువంటప్పుడు ఒక చిత్రం విడుదల అయిన వారానికే మరొక చిత్రం విడుదల అవుతుంటే ఎంత నష్టమో వేరే చెప్పనవసరంలేదు రెండోసారి చూడటంమాట అటుంచి ప్రతి చిత్రాన్నీ ఒక సారైనా చూడటానికి ప్రజలకు అవకాశం లేకపోతోంది.

చిత్రాల సంఖ్య బహు స్వల్పంగా ఉండే రోజుల్లో చిత్రాల మధ్య పోటీ సమస్యే లేదు దాదాపు ప్రతి చిత్రమూ దాని డబ్బు అది చేసుకున్న తరవాత గాని మరొక చిత్రం విడుదల అయ్యేది కాదు ఇప్పుడు చిత్రాలసంఖ్య పెరగటంతో పోటీ సమస్య వచ్చిపడింది చిత్రాల ఉత్పత్తిని అరికట్టటం సాధ్యమూ కాదు, భావ్యమూ కాదు ఎన్ని కొత్త చిత్రాలైనా రావటమూ మంచిదే, వచ్చి బలాబలాలు, తరతమ్యాలు చూసుకోవటమూ మంచిదే చిత్రాల సంఖ్య తగ్గిపోవాలని ఎవరూ



తన తప్పులన్నీ మన్నించమని అన్నను ప్రాధేయపడుతున్న తమ్ముడు మోహన్.
ప్రసాద్ ఆర్ట్ పిక్చర్సువారి "పెంపుడు కొడుకు"లో పుష్పవల్లి, సావిత్రి, గణేశన్, శ్రీరామమూర్తి

## ఆదీ - ఇదీ

కోరదు. అటువంటప్పుడు విడుదల విషయంలో ఎవరూ ఏమీ చేయగలిగిందిలేదు. ఏడాదికి 50 చిత్రాలదాకా తయారవుతాయనుకోండి. అప్పుడు వారాని కొకటి చొప్పున విధిగా విడుదలచేయవలసివస్తుంది చిత్రాలసంఖ్య అభివృద్ధి అవుతున్నప్పుడు విడుదల విరామాలను కంట్రోల్ చెయ్యటం ఎవరి సాధ్యమూ కాదు. మనకంటె ఎక్కువ చిత్రాలు తయారుచేసే హిందీ చిత్రపరిశ్రమ చూస్తే ఈ విషయం స్పష్టమవుతుంది. వారానికి నాలుగైదు చిత్రాలు కూడా విడుదల కావటంకద్దు.

దీని కొకటే పరిష్కారమార్గం ఉన్నట్టు తోస్తుంది నిర్మాతలు చిత్రనిర్మాణవ్యయం బాగా తగ్గించుకోవలసి వుంది తక్కువ కాలంలో ఎక్కువ పని చెయ్యటం, భారి సెట్టింగులపై మోజు తగ్గించుకోవటం, అనేక చిత్రాల్లోకి బుక్ అయిన ప్రముఖ తారలనే మళ్ళీ మళ్ళీ బుక్ చేయటం మాని కొత్త నటీనటులను తర్ఫీదుచేసి తీసుకోవటం— మొదలైన చర్యలద్వారా నిర్మాణ వ్యయం ఎంతైనా తగ్గించుకోవచ్చు. నిర్మాణవ్యయం తక్కువగా ఉన్నపక్షాన లక్షలకి లక్షలు నష్టం వచ్చే ప్రమాదం ఉండదు ప్రతి ప్రేక్షకుడూ ప్రతి చిత్రమూ చూడకపోయినా చిత్రానికి తగిలే దెబ్బ ఎక్కువగా ఉండదు అధిక ధనవ్యయంతో ఎంత అద్భుత చిత్రం తీసినా ఇన్ని చిత్రాల పోటీ మూలా, ఇంత ఆర్థిక మాంద్యం మూలా అధిక లాభాలు రావటంలేదు అటువంటప్పుడు నిర్మాణవ్యయం సగానికి సగమో, ఎంత వీలైతే అంత తగ్గించుకొని చిత్రాలు తయారుచేయటం వివేకలక్షణం.

* * *

చిత్రనిర్మాతలు మరొకవిషయం కూడా గుర్తుంచుకోవటం అవసరం చిత్రాలు అనవసరంగా పొడుగు పెంచటంవల్ల అనేక అనర్థాలున్నాయి ముఖ్యంగా పేర్కొనవలసినది: ఒకసారి 18 వేల అడుగుల చిత్రాన్ని చూసినవాడు రెండోసారి అంత చిత్రాన్ని చూడటానికి జంకుతాడు అదే ఏ పదివేల అడుగుల చిత్రమో, ఇంకా తక్కువ పొడుగు చిత్రమో అయితే, ఏమాత్రం నచ్చినా రెండోసారి కూడా చూడ బుద్ధి అవుతుంది అందులో చిత్రం నిండా ఏడుపులు, శోకాలు వుండి, జనరంజకంగా లేని పాటలెక్కువ ఉండినట్లయితే మొదటిసారే మొహం మొత్తుతుంది అదీగాక యుద్ధాత్పూర్వం ప్రజలకు ఉండే తీరుబాటు, ఓపిక సన్నగిల్లినట్లు తోస్తుంది. సారస్వతంలో కావ్యాలు చదివే ఓపిక సన్నగిల్లి గీతాలూ, నవలలు చదివే ఓపిక తగ్గి చిన్నకథలకూ ప్రాముఖ్యం హెచ్చింది అలాగే చిన్న చిన్న చిత్రాలకు గిరాకీ కలిగే రోజులు బహుశా వచ్చాయేమో నిర్మాణవ్యయందృష్టితో చూసినా చిన్నచిత్రాలవల్ల లాభమున్నది ఒక పెద్ద చిత్రాని కయ్యే ఖర్చుతో రెండు చిన్న చిత్రాలు వస్తాయి పైగా మన చిత్రాలు పొడుగ్గా వుండటానికి కారణం చెప్పవలసిన విశేషాలు ఎక్కువుండిగాని, చూపించవలసిన జీవితం విశాలమైగాని కాదు.

ప్రధాన కథతో సంబంధం లేని అంశాలవల్లనే మన చిత్రాలు పొడుగు పెరుగుతాయి హాలీవుడ్‌ను అనేక వ్యర్థవిషయాలలో అనుకరించటానికి ప్రయత్నించే మన నిర్మాతలు ఈ నిడివి విషయంలో ఎందుకు అనుకరించరో? హాలీవుడ్ చిత్రాలు సాధారణంగా పదివేల అడుగులకు లోపే వుంటాయి.

మామూలుగా 8 వేల అడుగుల చిత్రాలే ఎక్కువ మాస్తావుంటాయి. ఆ పరిమాణం లోనే చెప్పవలసినదంతా చెప్పటం జరుగుతుంది. మన నిర్మాతలు ఈపద్ధతినెందుకు అనుసరించరాదు?

* * *

ఇండియాలాటి ఉష్ణ దేశాల్లో కొద్ది వయస్సునుంచే సెక్సువాంఛలు బయలుదేరుతాయని శాస్త్రజ్ఞులంటూవుంటారు. కొంత కాలంనుంచి మన సినిమాలు చూస్తుంటే ఈ మాట నిజమేమో ననిపిస్తోంది. నాయికా నాయకుల బాల్యజీవితం వివరంగా చూపటం ఏ చిత్రంతో ఆరంభమైందో జ్ఞాపకం లేదు గాని ఇది ఇటీవల బాగా వాడుకలోకి వచ్చింది. నాయిక నాయకుడు చిన్నప్పటి నుంచి కలిసి మెలిసి పెరుగుతారు. వారికి అప్పటినుంచే ప్రణయం మొలకెత్తుతుంది. "నువ్వు లేందే నేను బతకలే" నంటూ ప్రేమగీతా లాలపిస్తారు; సన్నెలలో విహారాలు, ఏమిటేమిటో సంభాషణలు చేస్తారు, యౌవనులమాదిరిగా ప్రవర్తిస్తారు. ఇదంతా చూస్తుంటే ఆ పిల్లలమీద సానుభూతి కాక ఏవగింపు కలుగుతుంది. ఇంత అసహజంగా పిల్లలచేత ఎందుకు ప్రవర్తింపచేస్తారా అని దర్శకుల వివేకంమీద అనుమానం కలుగుతుంది. బహుశా ఇటువంటి చిత్రాలు చూసి ఎంతమంది బాలబాలికలు చ్యుత సంస్కారులవుతున్నారో చెప్పలేము. వీటి ప్రభావం వారిమీద తప్పకుండా ఉండిఉంటుంది. వారు కూడా ఆయా చిత్రాల్లోని బాల నాయికా నాయకులను జీవితంలో అనుకరించ మొదలిడతారు. ఇంతకంటే విచారించవలసింది మరి వుండదు.

* * *

పోనీ మన దర్శకులు యౌవనుల ప్రేమనైనా సహజంగా చిత్రించగలుగుతున్నారా అంటే అదీ కనబడదు. పిల్లలచేత యౌవనుల మాదిరిగా ప్రవర్తింపజేస్తే, యౌవనులచేత పిల్లలమాదిరిగా ప్రవర్తింపజేస్తారు. కళా స్రష్టలుగా పేరుపొందిన దర్శకులు కూడా ఇలాగే చేస్తున్నారు. నాయికా నాయకులు పాతికేసి ఏళ్ళు పైబడ్డ వారయినా చెట్లచుట్టూ పొదలచుట్టూ దాగుడుమూతలాడుకుంటారు, ఒకళ్ళ నొకళ్ళు తోటల్లో పడి తరుముకుంటూ ఆడతారు. అలిసిపోయి పచ్చికమీద పడిపోయి గడ్డి నములుతూ ఏవో అర్థంలేని పాటలు పాడతారు. "నిన్ను నేను ప్రేమిస్తున్నాను .." అని సుదీర్ఘంగా లెక్చర్లు కొడతారు. ఒకరి నొకరు చిన్నపిల్లలాగ వెక్కిరించుకుంటారు. శారీరకంగా పెద్దవారవుతారేకాని మానసికంగా బాల్యావస్థ విడిచిపెట్టరు. ఇటువంటి నాయికా నాయకుల పాత్రలను సృష్టించే

(51-వ పేజీ చూడండి)



రోహిణీవారి "లెగసీ"లో దొరస్వామి సుధాకర్‌ను ఏదో గద్దిస్తున్నాడు.

# ప్రశ్నలు..సమాధానాలు

శ్రీ జాలూరు ఆదిశేషు—మైలవరం (కృష్ణాజిల్లా)

కొండపల్లి ఒక చారిత్రాత్మక ప్రదేశము గదా—దానినిగురించి ప్రభుత్వ పురాతన వస్తుపరిశోధనశాఖవారు ఏమైనా చర్య తీసుకొంటారా? లేదా?

—పురాతన వస్తు పరిశోధనశాఖవారికి కొండపల్లి చారిత్రాత్మక ప్రదేశమని పురాతనకాలంనుంచీ తెలియును. అది వారికి తెలిసిన పురాతన విషయములలో ఒకటి. ఈ పరిశోధనశాఖ ఎందుకు శ్రద్ధవహించుటలేదో కొంత పరిశోధన చెయ్యాలి. వారికి పని ఎక్కువగా నుండుటవల్లనో, ధనం తక్కువగా నుండుటవల్లనో తెలియాలి. ధనం తక్కువైతే శోధనం తక్కువవుతుంది. అంతే రహస్యం.

* * *

శ్రీ శేశ్వర్—ఏలూరు.

హిందీ చిత్రాలను అనుకరిస్తూ తీసిన తెలుగు చిత్రాలు ఈమధ్య కొన్ని వచ్చినవి. అతిత్వరలో కొన్ని చిత్రాలు రానున్నవి. ఈచిత్రాల నిర్మాతలు తమ చిత్రాల మూలము హిందీచిత్రాలనుండి సేకరించబడినదని తెలియజేయ రెందువల్లనండీ?

—గ్రంథచౌర్యంలాగానే చిత్రచౌర్యం కూడా బాగా వ్యాప్తిలోకి వచ్చింది. మూలాన్ని పేర్కొన్నాలంటే కాపీరైటుకు మూల్యం చెల్లించవలసి వుంటుంది. ఆ తెడద లేకుండా కొద్ది మార్పులు చేసి అనుకరణ చిత్రాలు తీస్తున్నారు. ఈ పద్ధతి తెలుగు చిత్రాల్లోనే గాక హిందీ చిత్రాల్లో కూడా అమల్లో వున్నది.

* * *

శ్రీ బి. నరసింహము—సర్దకాని పేట (హైద్రాబాదు)

ఏనుగునకు స్వప్నములో సింహము కన్పించినయెడల ఏనుగు గతించునని యందురు. నోటితో చెప్పుటకు శక్తి లేని ఏనుగు ఎవరితో జెప్పెను?

—ఏనుగునకు స్వప్నములు వచ్చుననే విషయం ఏ మహాత్ముడైనా దివ్యదృష్టితో గ్రహించి ఆ విషయమును వెల్లడించిరా లేమో! ఏదైనా ఒక ఏనుగు సింహస్వప్నం మూలంగా మరణించి యుండవచ్చు. అట్టి స్వప్నంవల్ల ప్రతి ఏనుగయున్ను మరణించునని సిద్ధాంతీకరించడం సులభమైన పని కాదు. ఈ సిద్ధాంతంలో ఉన్న సత్యం స్వప్న సత్యమే.

దేవుని పూజ చేయవలెనని యందురు. "పూజ్యం" అనగా "లేదు" అని అర్థం. కనుక, దేవుని పూజ చేయుట యనగా, దేవుడు లేడని భావించడమా?

—దేవుడు ఆది అంతము లేనివాడు. అనంత స్వరూపుడు. ఆకాశం అనంతమైనది. ఆకాశం అంటే ఏమీ లేదు - "శూన్యం" అని అర్థం. అనంతమైన ఆకాశం ఏ విధంగా సర్వవ్యాప్తమై యున్నదో దేవుడు కూడా ఈ శూన్యాకాశంవలెనే నామ రూప గుణ రహితుడై, సర్వాంతర్యామిగా ఉన్నాడు. భగవంతుడు నిర్గుణుడు, ఆ నిర్గుణమైన దేవుణ్ని మనము ఆరాధించాలి. కాని నిర్గుణమైన "పూజ్యము" శూన్యమును ఆరాధించలేక, ఒక ఆకారస్వరూపం కల్పించి దేవుణ్ని పూజ చేస్తున్నాము. "పూజ్య"మైన దేదో తెలియడానికి యీ పూజ చేస్తున్నాము.

* * *

శ్రీ బి. కృష్ణమూర్తి—నిడుబ్రోలు.

ప్రతి చిత్రంలోను ప్రియుడు, ప్రేయసులకు మధ్య ఎడబాటు చూపుతారు. ఎడబాటు లేకుండా నిర్మాతలు చిత్రం తీయలేరాండి?

—ప్రేయసీ ప్రియులు లేకుండా చిత్రం తీయగలిగిన నాడే ఆ ఎడబాటు లేకుండా చిత్రం తీయవచ్చు.

* * *

శ్రీ కే. సీతారాం—పొన్నూరు.

తమిళ దేశములో త్యాగరాజ ఉత్సవములు జరుగుతూ ఉంటే ఆలిండియా రేడియోవారు "రిలే" చేస్తారు. ఆంధ్రదేశంలోని ఉత్సవములను రేడియోవారు "రిలే" చేయరు. కారణ మేమిటి?

—దక్షిణ దేశంలో తిరువాయూరులో త్యాగరాజులవారు సిద్ధిపొంది యున్నారు. అక్కడికి వచ్చిన సంగీత విద్వాంసులు ఆ పుణ్యక్షేత్రములో ఆయనను ఆరాధించడం ఒక అధిక విశేషం — ఈ అధిక విశేషం ఆంధ్రదేశంలో జరిగెడి ఉత్సవాల విషయంలో లేదు.

శ్రీ పట్నాల సన్యాసిరావు-గుణుపురం.

పాటను 'పిక్చరైజ్' చేయడమంటే ఏమిటి?

—సినిమా పాటను విడిగా రికార్డింగ్ రూములో రికార్డు చేస్తారు. ఆ పాట పాడే వ్యక్తి పాడుతూ చేయవలసిన హావభావ ప్రకటనను విడిగా షూట్ చేస్తారు. ఇలా షూట్ చెయ్యటాన్నే పిక్చరైజ్ చెయ్యటం అంటారు. చివరికి ఆ పాటను హావభావ ప్రకటనతో సింక్రొనైజ్ చేస్తారు.

* * *

శ్రీ దేగా రాధాకృష్ణయ్య నాయుడు గారు—నెల్లూరు.

ప్రేమయే ధనము ప్రేమయే కాంతి అన్నారు కవులు. అలా వారు ఎందుకన్నారు?

—ప్రేమయే కాంతి అనకపోతే, లోకం కాంతించదు - కవులకు కాంతి లేదు. వారిమీద లోకానికి ప్రేమ లేదు. ఇంకో విధంగా వ్రాయడానికి కవులకు వీలు లేదు. కవులమీద లోకానికి ఉన్న ప్రేమయే కవులకు ధనము — కనుక ప్రేమయే ధనము.

స్త్రీ అనేది సంఘంలో బానిస కాదు గదా! అటువంటి సందర్భంలో పురుషుని మాదిరిగా స్త్రీ కూడా స్వాతంత్ర్యం కోరడం విషయంలో మీ అభిప్రాయం ఏమిటి?

—పురుషునకు స్వాతంత్ర్యం ఉన్నది గనుక స్త్రీకి స్వాతంత్ర్యం ఉండవలెనని వాదించ నక్కరలేదు. ఏ పురుషులకైనా స్వాతంత్ర్యం లేకపోయినప్పటికీ, వారి కుటుంబంలో, వారి సంఘంలో ఉన్న స్త్రీలకు కూడా స్వాతంత్ర్యం ఉండకూడదని వాదించవలసివస్తుంది. పురుషులతో స్త్రీలు సమానం కావాలనే వాదన అవ్యక్తంగా ఉంటుంది. కాని, పురుషులకు స్వాతంత్ర్యం ఉన్నా లేకపోయినా, ఆ విషయంతో నిమిత్తం లేకుండానే స్త్రీకి స్వాతంత్ర్యం ఉండాలి. పురుషునకు పురుషత్వం వికాసం పొందడానికి స్వాతంత్ర్యం - స్త్రీలలోని స్త్రీత్వం వికాసం పొందడానికే స్వాతంత్ర్యం. ఒక జాతిలోని ఆత్మవ్యక్తిత్వం వికాసం పొందడానికే ఆ జాతికి స్వాతంత్ర్యం ఉండాలి.

శ్రీ పోకూరు వెంకటసుబ్బారావుగారు
—నెల్లూరు.

"ఇనుప కచ్చడాల్ కట్టుకొను మును ముచ్చులెల్ల తామరసనేత్ర లింక బందాలు గారె" అని (వరూధిని మనుచరిత్రలో) పల్కియుండెను గదా. ఆ కచ్చడముల ఉపయోగ మేమి? ఇప్పు డెక్కడనైన ఉన్నవా?

—ఇనుప కచ్చడము లనునవి స్త్రీలకు ప్రత్యేకంగా (*Chastity Belts*) అను పేరుతో ప్రాచీనకాలమందు ఉన్నట్లుగా కన్పిస్తుంది. వాటి బొమ్మలుకూడా గ్రంథాలలో కలవు. వరూధినికి వీని విషయమై తెలిసి పురుషులకు కూడా అట్టివి ఉండె వచ్చునని ఊహాగానం చేసిందేమో!

*　　*　　*

శ్రీ పి. భక్తవత్సలరావు—మద్రాసు.

రషెస్, ప్రీవ్యూ, ప్రెస్‌షో అంటే ఏమిటి?

—ఎక్స్‌పోజ్ చెయ్యబడిన ఫిలిమును ప్రాసెస్ చేసి ప్రింటు తీస్తారు. ఫొటోగ్రఫీ, నటన మొదలైనవి ఎలా వున్నాయో చూసుకోటానికి ఆ ప్రింటును అప్పటి కప్పుడు ప్రొజెక్టు చేసి చూసుకుంటారు. ఆ ప్రింటునే రష్ ప్రింట్ లేక రష్ అంటారు.

ప్రివ్యూ అంటే చిత్రం విడుదల చేయటానికి ముందు ప్రైవేటుగా కొందరికి చూపించటం. ప్రెస్‌షో అంటే ప్రత్యేకంగా పత్రికలవారి అభిప్రాయార్థం చిత్రాన్ని చూపించటం.

*　　*　　*

శ్రీమతి ఆర్. స్వర్ణలతా మాలతీకుమారి
—సికింద్రాబాద్.

నా మిత్రురాలను నొక ఆమెవద్ద అద్వితీయమైన భావాలు ఉన్నాయి. ఆమెకు రచనా నైపుణ్యం గూడా ఉంది. కాని, ఆమె సభాపిరికి అగుటవల్ల మితభాషిణి అగుటవల్ల ఆమె భావాలు ఆమెలోనే ఉండిపోయినవి. ఆమెలోని భావాలను పైకి తీసికొనిరావాలంటే నేను చేయవలసినదేమిటి?

—ఆమెలో ఉన్న అద్వితీయ భావాల సంగతి మీకు తెలిసినది గనుక వాటిని మీరు సంగ్రహించి ఆంధ్ర వారపత్రికకు మీరు వ్రాసి పంపండి. ఆ విధంగా ఆమె భావాలను మీరు పైకి తీసికొనిరావచ్చు. మీకు సభాపిరికితనం లేదు గనుక, మీరు కూడా ఆమెవలె మితభాషిణి కాము గనుక, ఆమె భావాలను మీరు వెల్లడించండి.

శ్రీ హెచ్. కృష్ణమోహన్‌రావు—
మచిలీపట్టణం.

సినిమాలో యాక్టర్ల పేర్లు ఆట ముందు చూపించుటకంటె ఇంటర్వెల్‌లో చూపించుట మంచిదని నేను అంటాను మీరేమంటారు?

—ఎప్పుడు చూపించినా ఒకటే ఎందుకంటే పత్రికలలోనూ, పోస్టర్లలోనూ చూసి వారి పేర్లు ప్రేక్షకు లిదివరకే తెలుసుకొని వుంటారు. హెచ్. జి వెల్స్ కూడా మీలాగే క్రెడిట్స్ చిత్రంఅంతంలో చూపించటం మంచిదని ఒకసారి రాశారు.

*　　*　　*

శ్రీ కె. కోటీశ్వరరావుగారు—మద్రాసు

స్నేహితులు గాని చుట్టాలు గాని రైలు ఎక్కి వెళ్ళునప్పుడు లేదా బస్సు ఎక్కి వెళ్ళునప్పుడు చేతులనైనా, చేతిరుమాళ్ళనైనా ఊపుతూ ఉంటారు దానికి కారణం ఏమిటి?

—ప్రయాణమై వెళ్ళిపోవుచున్న వారిని విడనాడుట స్నేహితులకు గాని బంధువులకు గాని ఒక ఎడబాటువంటిది ఊరికి వెళ్ళిపోవుచున్న వారితో ఎంతదూరం వెంట వెళ్ళి సాగనంపగల్గితే అంతదూరం ఎద్దు బండి వెంట వెళ్ళి సాగనంపడం పూర్వాచారం. రైళ్ళు బస్సులూ వచ్చిన తర్వాత పూర్వపద్ధతిగా సాగనంపుటకు వీలులేక, వారిచూపు మనకూ మన చూపు వారికీ అందినంతదూరం చేతులనూ రుమాళ్లనూ ఊపుతూ రైలు గాని బండి గాని కనుమరుగైనంతదాకా చూస్తూ, తమ ఆపేక్షనూ ఆదరణనూ ఆ విధంగా చూపిస్తున్నారు.

*　　*　　*

శ్రీ పి. వి. సుబ్బారావు—మద్రాసు.

అంజలీ పిక్చర్సువారి పరదేశిలో లక్ష్మి (అంజలీదేవి) చంద్రం (నాగేశ్వరరావు) మొదటదఫా జాబు వ్రాయగా వారి జాబులు అరటాకు తెల్లకాగితముపై బొటన వ్రేలి ముద్రలు మనిషితో వేసి పంపిస్తుంది తిరిగి రెండవదఫా కూడా అరటాకు తెల్ల కాగితములో అరచేతి (హస్తము) గుర్తులు మనిషితో వేసి పంపిస్తుందిగదా? యీలాగు చేయడములో దర్శకుని అభిప్రాయమేమిటో తెలుపవలయును.

—సినిమా చిత్రంలో చూపించబడే ఎంత స్వల్పాంశమైనా ప్రేక్షకులకు తక్షణమే గ్రాహ్యం అయేలాగ ఉండాలి దర్శకుడు తను భావించినదాన్ని సుస్పష్టంగా ఉద్ఘాటిస్తూ చిత్రీకరించలేకపోతే కథకు నష్టం వాటిల్లుతుంది. ఎందుకంటే సినిమా అనేది వివరంగా ఆలోచించటానికి వీలివ్వనంత వేగంగా నడుస్తుంది. అందుచేత త్వరగా అర్థంగాని విషయాలు ఎక్కువైన



న్యూథియేటర్సువారి "యాత్రిక్"లో వసంతచౌదరి, అరుంధతి ముఖర్జీ.



"అజ్ఞానాన్ని ద్వేషించు; ఆత్మసాక్షాత్కారం పొందు; అదే ముక్తిమార్గం" అని సాధువు బోధిస్తున్నాడు.
న్యూథియేటర్సువారి "యాత్రిక్"లో ఒక దృశ్యం.

# ★ ప్రశ్నలు - సమాధానాలు ★

కొద్ది ప్రేక్షకుడికి విసుగు ఎక్కువ అవుతూంటుంది. ఈ ప్రాథమికసూత్రం పాటించకపోవటం దర్శకుని లోపం.

* * *

శ్రీ కర్ర వీరారెడ్డిగారు—పూబలంక.

గ్రంథాలలో సంధులు, అరసున్నలు, సమాసాలు మొదలైనవి వాడుకలో వుంటున్నాయికదా—ఇప్పటి పత్రికలలో అవేమీ కనిపించటము లేదు. అవి అవసరము లేదా?

—పత్రికలలో నిండు సున్నలు ఉండగా అరసున్నలు అనవసరం. రూపాయిలోనే అర్ధరూపాయి యిమిడి ఉన్నది గనుక - ప్రజలకు ప్రభుత్వానికీ మధ్య పత్రికలే సంధులు అయినప్పుడు పత్రికలకు వేరే సంధులతో నిమిత్తం లేదు. వ్యాకరణ పండితులు వ్రాసే వ్యాసాలుగల మాస పత్రికలు సమాస పత్రికలుగా ఉంటే ఉండవచ్చు. వారపత్రికలకు, దిన పత్రికలకు సమాస ప్రసక్తి అనవసరం.

శ్రీ నిండ్ర జేసింగురాజు—మద్రాసు.

మద్రాసు ప్రధానమంత్రి రాజగోపాలాచారిగారు తలకు ఖద్దరుటోపీ పెట్టడంలేదు. కారణం ఏమిటి?

—జన్మ మెరిగిన బ్రాహ్మణునకు జందెమెందుకు? వారు ఆచార్యులవారు, అంటే గురువులు. వారు ఇతరులకు టోపీ పెట్టవలసినవారే గాని, వారికి ఇంకొకరు టోపీ పెట్టవలసిన స్థితిలో వారు లేరు.

* * *

శ్రీ ఎస్. వి. ఎస్. ఆర్. డి. జె. రావు —జమ్‌షెడ్‌పూర్.

ఒక సినిమా డైరెక్టరుకు కథ వ్రాసి పంపాలన్నప్పుడు కథ వ్రాసి పంపాలా లేక స్క్రిప్టు వ్రాసి పంపాలా?

—సాధారణంగా రెండు మూడు పేజీల సినాప్సిస్ రాస్తే కథాస్వరూపం తెలిసిపోతుంది. అది నచ్చితే నిర్మాతగాని డైరెక్టరుగాని మిమ్మల్ని పూర్తి సంఘటనలతో వివరంగా ఒక చిన్న నవల సైజులో కథ రాసి ఇమ్మని అడగవచ్చు. అప్పుడు దాని ఆధారంతో స్క్రీన్‌ప్లే వగైరాలు తయారు చేస్తారు.

* * *

శ్రీ బి. వి. నరసింహం—కడప.

మన సినిమా నిర్మాణమును 'చలన చిత్ర పరిశ్రమ' అనవలయునా లేక 'చలన చిత్ర కళ' అనవలయునా? ఏది సబబు?

—సినిమానిర్మాణం పరిశ్రమ, కళ రెండూనూ. అది కళాపరిశ్రమ (*Art Industry.*)

సినిమాలలో డైలాగ్స్‌ను యే పరిస్థితిలో ఉపయోగించాలి? డైలాగ్స్ సినిమాలలో హెచ్చు అవసరమా లేక నాటకాల్లోనా?

—ఏదో చెప్పవలసింది వుంటేనే గాని డైలాగ్ పెట్టకూడదు. ఆ డైలాగ్ వల్ల పాత్రపోషణమో, కథా వివరణమో ఏదో అవసరమైన పని జరగాలి. ఉబుసుపోకగా మాట్లాడించకూడదు. డైలాగ్ అవసరం సినిమాలో కంటె నాటకంలోనే హెచ్చు. డైలాగ్ లేనిదే సినిమా ఉండవచ్చు గాని నాటకం లేదు. ★

# ★ గోడమీద బొమ్మ ★

(౩౬-వ పేజీ తరువాయి)

విధంగానో గింజుకుని చివరకు అన్నాడు. "మీరు వస్తారని యిద్దరం ఎదురుచూశాం! పిల్లనైనా పంపించారు కాదు. ఇప్పుడు మీ శరీరంలో కులాసాగా వుందను కుంటాను"

సుందరమ్మ మాట్లాడలేదు. ఆమె ముఖం యెన్నడూలేనిది, కలచబడి పాలిపోయి వుంది. రామం మళ్ళీ మెల్లగా చాలసేపటి నుండి అనాలనుకుంటున్నది అన్నాడు. "అక్కడ నా పని పూర్తిఅయింది. అందు చేతనే యిప్పుడు నా యింటికి వచ్చేశాను"

సుందరమ్మ చప్పున చీరకొంగుపట్టుకుని కళ్ళు తుడుచుకుంటూ, "నేనేం చేసినా . యం అన్నా . . నా కూతురు అల్లుడూ బాగుపడతారనేగా .." సుందరమ్మ దుఃఖంతో మరి మాట్లాడ లేకపోయింది. ఒకనాడు మానవత్వం యేకోశాన్న లేదను కున్న రామం, అత్తగారి మాటల విధానంకు శరీరం గగుర్పాటు చెందటంవల్ల, మాటలు దొరక్క తడబడ్డాడు. ముఖంలో యీనాటికి తన నిజమైన రూపకళ మెరిసింది. పెదాలమీద చిరునగవుతో, అమితానందం వల్ల చెమ్మగిల్లిన కళ్ళతో ఆగిఆగి అన్నాడు. "మీది తప్పని నేనన్నానా? ఆస్తి వదలటానికి నేనుమాత్రం ఎంతకష్టపడ్డాను? మా చెల్లెల బ్రతుకు నిలవాలని మీరు మాత్రం ఆశించరా?"

సుందరమ్మ మాట్లాడలేదు. కొద్ది నిమిషాలు నిశ్శబ్దంగా గడచిపోయాయి. అంతవరకు ప్రక్కగది తలుపుచాటునుండి కళ్ళు నిండుగా నీళ్ళతో నిల్చున్న జానకి మేడ మెట్లవేపు నడిచింది. రామం భార్యమెల్లెగ ప్రాకుతుంటే చూచి వెంటబడ్డాడు.

మేడమీద గది ఒక్క తలుపుతప్పించికిటికీ తలుపులు కూడమూసివున్నాయి. అడుగు పెట్టగానే జానకి భర్తను గాఢంగా కౌగలించుకుంది. తల వక్షంమీద వాల్చి, నిట్టూరుస్తూ, మధ్యమధ్య వెక్కివెక్కి ఏడుస్తోంది, రామం కొంతసేపటివరకూ ఆమెను ప్రేమంతా కూడగట్టి గారవించాడు. ఆమె నుదుటిమీద పడుతున్న ముంగురులను సరి చేస్తూ, రుచికరంగా అన్నాడు "పిచ్చి దానా !"

"వచ్చారు — అంతే చాలు!" ఇక మాట్లాడలేకపోయింది జానకి. "బావుంది, నీ దగ్గరకురాక యెక్కడికి వెళ్తాను" ఆ లతాంగి ముఖం చిరునవ్వుతో విరాజిల్లింది

"అలా ఒకసారివెళ్ళి బావతో చెప్పి వద్దాం వస్తావా?"

ఇద్దరూ బయలుదేరేసరికి బాగా చీకటి పడిపోయింది. రంగయ్యగారిల్లు కళకళలాడిపోయింది. పార్వతి అమితానందంతో కొంతసేపటివరకూ అలా నవ్వుతూనే వుంది.

మేడమీద వరండాలో రాత్రి ఎనిమిది గంటలవరకూ యిద్దరూ మాట్లాడుకుంటూనే వున్నారు. భద్రంతో మాట్లాడుతున్న రామం నెమ్మదిగాలేచి సమీపంలోనే పార్వతితో మాట్లాడుతున్న భార్యను, "ఎనిమిదైంది లేవమన్నాడు పార్వతి తడుముకోకుండా, "ఎక్కడికి?" అని ప్రశ్నించింది. రామం నవ్వి, "ఈసారి బావ గడువిచ్చి మరీ పొమ్మనలేదు లే చెల్లీ!" అన్నాడు.

భద్రం ముఖం యెత్తలేదు. పార్వతికి కూడ మాటలు దొరకలేదు

"రోజూ వస్తుంటారా! ఈసారి బావ ఎవరినీ కాపలా పెట్టలేదుగా చెల్లీ జానకీ! లే ."

భద్రం మాట్లాడలేదు కాని కళ్ళెత్తి చూశాడు. పార్వతి జానకిని లేవనీయకుండా పట్టుకుని—

"బావమరదులు హాస్యమాడుకుంటున్నారు లే వదినా! ఇక్కడవుండక ఎక్కడికి వెళ్తారు?"

రామంలేచి నిల్చుని, "హాస్యం మాటకేం గానీ—అక్కడ చూస్తుంటారు, వస్తా వమ్మా!" అన్నాడు.

జానకి లేచి నిల్చుండిపోయింది. పార్వతి నిల్చుని ముందుకొచ్చి అంది, "అక్కడికి వెళ్ళటానికి వీలులేదన్నయ్యా!"

"ఏం మా అత్తగారు, మీ వదినగారు ఏకమై .."

పార్వతి ముఖం వంచింది. రామం

భార్య:—

"ఎబ్బెబ్బే! ఆ విమలమ్మ గారికి కానీ, ఆవిడ చెల్లెలికి కానీ, కొంచెమైనా మర్యాద తెలియదండీ!

భర్త: "ఏం జరిగిందేం!"

భార్య: "అది కాదండీ! నేనొక చెంప మాట్లాడుతూ వుండంగా ఆవిమలమ్మ గారు ఒక పదిసార్లు, ఆవిడ చెల్లెలు గారు ఒక వందసార్లు ఆవలించారండీ!"

భర్త: "వాళ్లు నిజంగా ఏమైనా చెప్పాలని నోరు తెరిచారేమో నే-నువ్వు ఎక్కడా ఆగకుండా ఒకటే ధోరణిలో చెప్పుకు పోతుంటే ఆవలింత వచ్చినట్లుగా నటించి వుంటారు కానీ, నిజంగా వాళ్లకు అన్ని ఆవలింతలు వచ్చివుంటా యంటావా?"

ముఖంలో తృప్తి, ఆనందము, సిగ్గు మెలి వేసుకున్నాయి. మాటలు పొడిగించాడు "జానకి కూతురు కాదా— రామం అల్లుడు కాదా చెల్లీ!" మళ్ళీ నెమ్మదైన స్వరంతో అన్నాడు. "ఒకాయన చెప్పారు—జంతువులకే వాటి పిల్లలమీద మమకారమున్నప్పుడు పొదిగినంత మాత్రాన కోళ్ళు పిల్లలను వెంటపెట్టుకొని పెంచినప్పుడు మనుష్యులకు వాళ్ళ సంతానంమీద వుండదా అమ్మా? ఏం అన్నా ఏంచేసినా అభిమానం లేక అంటారా చేస్తారా?" ఈ మాటంటూ బావవేపు నిదానించి చూశాడు. అంతా నిశ్శబ్దమైంది. వాతావరణం చల్లగా వుంది

"వస్తాను బావా!" రామం సెలవు తీసుకోగానే భద్రం నిలుచున్నాడు. బావమరదులు ఒకరి వెనుక ఒకరు మెట్లుదిగారు. జానకి క్రిందకు వచ్చేవరకూ వాకిట రామం నిల్చున్నాడు. ఇద్దరూకలిసి దిగువ మధ్య గదిలో ఒకమూల పడున్న సరసమ్మ దగ్గరకు

వెళ్లారు. దగ్గరలోనున్న సీతాలక్ష్మి వీరిని చూచి వెంటనే నిల్చుంది.

రోడ్డువేపు జానకి, రామం, ఆమె దగ్గర కూర్చుని, "వస్తానం"టూ రామం లేచాడు. వరసమ్మ తేరిచూచి ఆక్షణంలోనే బొట బొట కన్నీరు కారుస్తుంటే రామం చూడ లేకపోయాడు. "వస్తానమ్మా!" అంటూ బయటకు వచ్చాడు

వెళ్ళిపోయే ముందు సీతాలక్ష్మి గదిలో నుంచే అన్నది. పెద్దాళ్ళలో ఆ రంగయ్య బాబుని, చిన్నాళ్ళలోనిన్నూ చూశాను. రామం! మా తమ్ముడు నీకెంతయినా ఋణ పడివుంటాడు "

రామం ముందు కడుగువేస్తూ ఆగి, "నాకొక్కదమ్మా! ఋణపడింది. మా వాడలో యింత మార్పు తెచ్చిన ఆ దేవు నికో, దయ్యానికో ఋణపడి వుంటాడు

సీతాలు, సిగ్గుతోపాటు గర్వం మన సులో తిరగ్గా తలదిచింది

రామం, జానకి సందుమలుపు తిరిగే వరకూ భార్యాభర్తలు వీధి అరుగుపై నిల్చునిచూస్తున్నారు. కంటికి కనబడక పోగానే భద్రం భార్యవైపు తిరిగి ఆమె ముఖంలోనికి చూశాడు. నీరునిండిన ఆమె కళ్ళను చూసి, ఆమె భుజంమీద చెయ్యి వేసి మెల్లగా యింటిలోనికి నడిచాడు.

కాదంబరివారి వీధిలోనికి వచ్చేవరకూ, రామం జానకి మౌనంగానే నడిచారు రామం హఠాత్తుగా ఆగి మొదటి ఎలక్ట్రిక్ లైటు దగ్గర చూస్తుంటే, జానకి "ఏం చూస్తున్నారు?" అని ప్రశ్నించింది

"అబ్బే ఏమీలేదు" అంటూ నడకసాగిం చాడు. మళ్ళీ రెండో దీపస్తంభంవద్ద ఆగి ఏదో పోయిన వస్తువును వెతుకుతున్నట్లున్న రామంను, జానకి మళ్ళీ ఆ ప్రశ్నే నొక్కి వేసింది. మరల అదే సమాధానంతో ముందుకు నడిచాడు.

చివర దీపంవద్ద ఆగాడు. రోడ్డుమీది కోతి, పసుపు బొమ్మలు పూర్తిగా మాయ మయినాయి కాని, యీగోడమీద బొమ్మ చెక్కు చెదరలేదు జానకి "యేమిటండీ?" అంది రామం ఆ పాడుగోడను చూపిస్తూ, "ఆ బొమ్మను చూశావా?" అన్నాడు

ఇద్దరూ గోడ దగ్గరగా వెళ్ళారు. దీప కాంతి ఆ పరిసర ప్రాంతంలో స్వచ్ఛంగా పడుతోంది. జానకి ఆ బొమ్మ వేపుచూసి, "అబ్బే! యిదేమిటండీ యిలావుంది - అష్ట వంకరలతో"

"సరిగ్గా చూడు!"

"బాగుంది నాకేమైనా భత్స్యరం వచ్చిందనుకున్నారా? ఇంత గుండెకాయ ఏ మనిషికైనా వుంటుంది? కాళ్ళకు కూడు లతో పొడుగ్గాంటె మెడకు ప్రాడుకట్టుకు లాగుతుంటే ఎవరైనా నవ్వుతారా?"

రామం భార్యవైపుచూసి నవ్వాడు. జానకి ముందుకు అడుగువేస్తూ, "పదండి పోదాం" అంది.

"కడుపుమీద ఏం రాసుందో చది వావా?"

"ఏడ్చినట్లేవుంది బొమ్మ దిగువున ఎవ రైనా రాసుకుంటారు కాని, కడుపుమీద వ్రాస్తారా?"

"అసలు ఏం రాసుందో చదువు "

జానకి గోడదగ్గరగాపోయి బొమ్మవైపు తీక్షణంగా చూసింది బొమ్మకడుపుమీద వ్రాయబడివున్న, "శాంతం, సహనం, త్యాగం" అన్న మాటలు చదివింది వెంటనే భర్తవైపు తిరిగి, "ఎవడో పిచ్చివాడు మసి బొగ్గు దొరికింది కదా అని పిచ్చిగీతలు గీసుక పోయాడు. మా తమ్ముడు యింతకన్న మనిషి బొమ్మ అందంగా వేస్తాడు. పదవండి చూద్దురు గాని!"

ఇద్దరూ చెయ్యి చెయ్యి కలిపి యింటి వైపు నడిచారు గాలికి ఆమె చీరకొంగు రెపరెపలాడుతోంది. రామం ఆ కోమ లాంగి వయ్యారపు నడకచూస్తూ, "నిజం చెప్పావు జానకీ! ఎవడో పిచ్చివాడు పిరికి వాళ్ళకోసం వ్రాసివుంటాడు!"

ఐపోయింది. 

##  ఈ లోకం 

(19-వ పేజీ తరువాయి)

ఆ మందు తీసుకురండి నా లక్ష్మిని ఏమ యినా సరే బ్రతికించాలి

స : డబ్బు లేదు.

క . రామయ్య నడగకపోయారా ?

స అడిగాను సర్దలేనన్నాడు.

క నారాయణ ఏమన్నాడు?

స ఒక పదిరోజు లాగితే నేకాని ...

క పదిరోజులా . . పదిరోజులదాకా లక్ష్మి గతేం కావాలి? మీ కింతమంది స్నేహితులు, ఇంత పలుకుబడి ఉంది గదా. వాళ్ళెవరూ యివ్వలేకపోయారా?

స : ఇవ్వ లేదు. నాకు తెలిసినవాళ్ళ నందరినీ అడిగాను. బ్రతిమాలాను. గడ్డం పుచ్చుకున్నాను. "మీకంటేనా, ఉంటే యివ్వమటండీ, సమయానికి అదుకోలేక పోయాము" అన్నారు కృతఘ్నులు. చీల్చి చెండాడినా పాపం లేదు. విశ్వాస ఘాత కులు!

క ఎవర్నని ఏమి ఫలం! ఉన్న నాడు పలకబోశారు అడగనివాడిది పాపం. ప్రతి వాడినీ నమ్మారు. ఇప్పుడు తెలిసొచ్చింది మీకు కన్న కూతురు ప్రాణాలు రక్షించు కోవడానికి వంద రూపాయలు పుట్టలేదు మీకు గంపెడు స్నేహితులు. అందరినీ ఆదరించారు ఫలితం అనుభవించాలి

స : ఇంక చాలు కమలా, తెలిసొచ్చింది ఇలాంటి బుద్ధి తక్కువ పని ఎన్నడూ చేయను

(తలుపు కొట్టిన చప్పుడు)

స . ఎవరది?

రామారావు : నేనే నాన్నా.

స : ఏరా వొచ్చేశావు?

రాము : జీతం కట్టలేదని రోల్సులోంచి నా పేరు కొట్టేశారు నాన్నా, ఒక స్నేహి తుడిదగ్గర రైలు ఛార్జి అప్పు తీసుకుని వచ్చాను. ఇంకా రూమురెంటు, హోటలు బిల్లుయివ్వాలి. అదేమిటి నాన్నా లక్ష్మికేం?

స : జ్వరంగా ఉంది . ఏం భరవా లేదులే.

రా : ఎప్పటినుంచి ?

స . పదిహేనురోజులనుంచి.

రా మందిస్తున్నారా ?

స ఆఁ డాక్టరిస్తున్నాడు.

రా . ఏం జ్వరం అని నిర్ధారణచేశారు ?

స : టైఫాయిడ్ అన్నాడు

రా కొత్తగా మందొచ్చిందట. అదిస్తు న్నారా ?

స . ఇంకా లేదు. ఇవ్వాళ నుంచి యిద్దామనుకుంటున్నాము.

రా ఏం, ఇన్నాళ్ళనుంచి ఎందు కివ్వలా?

స : (మౌనం) ..

క ఏమండోయ్, అమ్మాయి వళ్ళు చల్లబడుతూంది త్వరగా రండి.

రాము : నాడి కూడా నెమ్మదిగా కొట్టు కుంటోంది. డాక్టరు దగ్గరి కెళ్ళొస్తాను

స ప్రయోజనం లేదు రామూ.

క : లక్ష్మి,. లక్ష్మి, లక్ష్మి వెళ్ళిపో యావా చిట్టితల్లీ, ఎన్నో అచ్చట్లు, ముచ్చట్లు తీర్చాలనుకున్నాము తల్లీ . . . లక్ష్మి లక్ష్మి (ఏడుపు)

రాము : నాన్నా, అన్యాయంగా లక్ష్మిని చంపేశారు నాన్నా (ఏడు స్తాడు) ..

  

సత్యం : నా చిట్టితల్లి పోగానే నా

# ★ ఈ లోకం ★

భార్య పుట్టింటికి వెళ్ళింది. ఇంట్లో మాకు రోజులు గడవడమే కష్టమయింది. ఈ బాధంతా పడలేక మా పెద్దబ్బాయి, ఎక్కడికో వెళ్ళిపోయాడు.

నా పెద్ద కూతురుకి పెళ్ళి చేస్తాననే ఆశ పోయింది. అబ్బాయి వెళ్ళిపోయిన కొన్నాళ్ళకు మా అమ్మాయి.. వివాహం చేయలేక పోయాను.. . .. తన దారి తను చూసుకుంది.

రం : (నిట్టూర్పు)

స : ఈ దుఃఖం ఆపుకోలేక, వండిపెట్టే దిక్కులేక, నా భార్యను తీసుకొద్దామని అత్తవారింటికి వెళ్ళాను

* * *

మామగారు ఏమోయి యిలాగొచ్చావు!

స : దాన్ని చూసిపోదామని

మా : ఎంతదయ వాళ్ళమీద. ఉద్ధరిస్తున్నావు వాళ్ళందరినీ

స : (మౌనం).

మా · పిల్లది పలాయన మయిందటగా.

స : (మాట్లాడలేదు)

మా : అమ్మాయిని నీపాలుచేసి దాని జీవితం నాశనంచేశాను. ఏదో వెలగబెడతావని ఆశపడ్డాము! ఇంత అసమర్థుడవని తెలిస్తే మా గడపయినా తొక్కనిచ్చేవాణ్ణి కాదు. దౌర్భాగ్యుడా! ఏ మొహం బెట్టుకొచ్చావు

స రోజులు బావుండలేదు మామగారండి.

మా : అవును, నా రోజులు బాగుండలేకే నీకిచ్చాను నిశ్శేషంలాంటి సంబంధాలు ఎన్నో వదులుకొని. దాని ముఖం చూడడానికయినా అర్హత లేదు. పో అవతలికి.

స : మామగారూ!

మా : ఏం ? ఎందుకు కోపం ? ఉన్నమాటన్నాను, ఉలిక్కిపడతావెందుకు? చేసిన నిర్వాకం చాలదూ!

స : కమలా! నువ్వీ క్షణం బయలుదేరాలి. నువ్విక్కడ యింకో నిమిషం ఉండడానికి వీల్లేదు.

మా : అంత పౌరుషం గల వాడవే అయితే దానికీ ఖర్మమెందుకు పడుతుంది! అమ్మాయి! నువ్వు గడప కదలడానికి వీల్లేదు.

స. కమలా, ఆఖరుసారిగా పిలుస్తున్నాను. వస్తే నాతో రా, లేకపోతే నీకు నాకూ యింతటితోసరి. ఏం మాట్లాడవేం——

మా : ఏమిటోయి మాట్లాడేది, నీ ప్రతుకు నువ్వేడవలేవు గాని మెడకు డోలు కూడా ఎందుకు?

స కమలా, నే పోతున్నాను!

* * *

సత్యం : అప్పటినుంచి ఏకాకినైపోయాను. ఎక్కడ దొరికితే అక్కడ భోజనం. ఏదో వసారాలో నిద్ర. ఆరు నెలలు గిరుక్కున తిరిగొచ్చాయి. ఓనాడు కాటన్ మార్కెటులో 300 దాకా డబ్బొచ్చింది. దాంతో బట్టలు కుట్టించుకున్నాను. ఒక యిల్లు, వ్యవహారం ఏర్పరచుకొన్నాను. క్లబ్బులో చేరాను. కొన్నాళ్ళకి ..

* * *

సత్యం ఊఁ టేబిల్ వెయ్యండి

(టేబిల్ మీద డబ్బులు వేస్తారు)

దాసు నాది లీడ్ కూడా.

ప్రభాకర్ · పావలా

స నాదీని

దా ఇదిగో

ప్రభాకర్ అర్థ

స (డబ్బులు వేస్తూ) ఊఁ!

దాసు : ఊఁ

ప్రభా ముప్పావలా.

స ఇదిగో

[టేబుల్ మీద డబ్బులు వరుసగా పడుతూంటాయి]

ప్రభా · చూశాను నాది రూపాయి.

దా నాదొక రూపాయి.

స నాదొక రూపాయి

ప్రభా మూడు రూపాయలు.

దా . మూడు.

స అయిదు

ప్రభా నాదీ అయిదు.

దా పది.

స పది.

ప్రభా ఊ ఊ ఇక మనం తగ్గాము.

దా పదిహేను

స · ఊఁ.

దా ఇంకో పదిహేను.

స ఇదిగో పదిహేను.

దా నాది యాక్షైహ

స నాదో యాక్షైహ.

దా ఏది యాక్షైహ?

స . వేస్తారే ఆడు.

దా అదంతా కుదరదు.

స నేను పందెము ఓడిపోతే అంతా నీకిచ్చి వదులుతాను

దా : అదేం లాభం లేదు

స · సరే ఇందాక పదిహేనుకు తిప్పు.

దా · యాక్షైహ అన్నావు. అది వెయ్యి. తిప్పుతాను

స : శంకరంగారు, ఒక యాక్షైహ ఇవ్వండి ఉంటే

శంకరం : లేవు బ్రదర్. ఉంటే యివ్వనూ!

స · దాసూ, నావి మూడాసులు, పందెం నాది. నాదగ్గర డబ్బు లేనంతమాత్రాన నువ్వు యిలా చేయడం బావుండలేము

దా · అంత డబ్బులేనివాడివి పేకాటకెందు కొచ్చావు? యింటిదగ్గర గోళ్ళు గిల్లుకుంటూ కూర్చోకపోయావు!

స : ఇదిగో చూడు. మూడాసులు పందెం తీసుకుంటున్నాను.

దా క్యాష్‌మీద చెయ్యి వెయ్యబాకు చేతనయితే ఆ యాక్షైహవేసి త్రిప్పమను. లేకపోతే పందెంమీద ఆశవదలుకో

స నా డబ్బు నాకిచ్చేయి పందెం వదులుకుంటాను.

దా ఆ సంగతి మూలనున్న ముసలమ్మకు చెప్పు. పెద్దముగాడు బయలుదేరాడు ఆయన డబ్బాయన కిచ్చేయాలట. అంత చేతగానివాడివి, లేనివాడివి టేబుల్ దగ్గర ఎందుకు కూర్చుంటావు!

స అయితే నా డబ్బయినా నా కియ్యవన్న మాట

దా ఏమీ యివ్వను. నీ బాబుతో చెప్పుకో. ఇంతసేపు కూర్చోవడమేమిటి?

[డబ్బులు లాక్కుంటాడు]

స దాసూ!

దా మర్యాదగా వదులు చొక్కా. లేకపోతే పళ్ళు రాలతాయి, వళ్ళు తెలియడం లేదేమిటి?

స ఏమిటోయి నువ్వు చేసేది ?

దా ఏమిటా, (దెబ్బ కొడతాడు)

* * *

అలా అంతమయింది ఆనాడు. దాసు ఆ రోజులు మర్చిపోయాడు. కాలం దొర్లిపోతోంది. దానూ, నేనూ మళ్ళీ ఒక టేబిల్ దగ్గరే ఆడుతున్నాము. నేనుమాత్రం ఆనాటి సంగతి మరచిపోలేదు. ఇందాకటి మర్షణ నువ్వు చూశావుగదా! నేను నా జీవితంలో యిలాంటివి ఎన్నో చూశాను. ఈ మనుష్యులతోనే విరోధం నాకు. దెబ్బలు తిని నా హృదయం కరుడు గట్టిపోయింది. నిర్దాక్షిణ్యంగా రెండు లక్షల రూపాయలు సంపాదించాను. నా తదనంతరం ఒక అనాధశరణాలయానికి వ్రాశాను నాకు ఈ పెద్దమనుష్యులమీద ఎందుకుండాలి కరుణ?

[తెర] 

# * గోపి చేసిన గోల *

(౪౯-వ పేజీ తరువాయి)

చెప్పింది. మందు డాక్టర్ని పిలుచుకురండీ!

రామా: లక్ష్మీ; గోపి ఏ మందమ్మా త్రాగింది? ఏదీ ఆ సీసా తీసుకురా చూదాం.

లక్ష్మి [సీసా తెచ్చి చూపిస్తుంది] ఈ మందే నాన్నా, నేను వచ్చేటప్పటికి నోట్లో వేసుకుంటున్నాడు. 'ఈ మందు తీయగా లేదేమే అక్కా' అనికూడా నన్ను అడిగాడు నాన్నా!

రామా: [మందు పేరు చదివి] అరి వెధవ! దీనికేనా ఇంత హంగామా. ఈ మందు ఏమీ ప్రమాదం చెయ్యదు. అరే. గోపి. అరే గాడిదా! నిన్నే! ఎట్లా వుంది రా? [లేవదీసి కూర్చోపెడతాడు]

గోపి: [కళ్లు నులుముకొంటూ] అక్క చెప్పింది నాన్నా, విషమని. మా మాష్టరు చెప్పారు-విషంతింటే చచ్చిపోతారని. అది తిన్న తరువాత నాకేమో కళ్లు తిరిగినట్టు అనిపించింది. [తండ్రి ముఖంకేసి చూసి] ఇప్పుడు కాస్త తగ్గినట్లే ఉంది నాన్నా!

లక్ష్మి: అవును నాన్న. సీసా మీద ఎఱ్ఱ సిరాతో "పాయిజన్" అని వ్రాసివుందికదా నాన్న? పాయిజన్ అంటే విషమేగా?

రామా: కానే పిచ్చతల్లి! ఆ ఇంగ్లీషుమందులు అంతేనే. మోతాదుకన్నా ఎక్కువతాగితే ప్రమాదం చేస్తయి. అయినా, అరేయి గోపీ నువ్వు మందుల బీరువా తలుపు ఎందుకు తెరిచావో చెప్పు.

గోపి: లేదు నాన్న...అక్కే మరే...

రామా: అక్క తీయమందా?

గోపి: లేదు! నాన్నా! చీట్లపేక అడ్డామని, పేక, బీరువాలో ఏమైనా ఉందేమో చూడమంది నాన్నా.

రామా: నేను ఇంట్లో వున్నంత సేపు పుస్తకాలముందు కూర్చొని, నేను అల్లా అలా బయటకు వెళ్లానో లేదో, యింతలో మీకం చీట్లూ, పేకముక్కా కావల్సివచ్చాయేం? మీరు యికచీట్లపేక తాకినా, దాని పేరెత్తినా, మరొకళ్లు ఆడుతున్నచోట చేరినా వళ్ళు చీరేస్తాను. తెలిసిందా? అయ్!...

గోపి: అక్కే అడ్డమంది నాన్నా!

తల్లిదండ్రులను గురించి ముక్కుపిల్లలచేత ఒకదేశ్వారు కాంపోజిషన్ వ్రాయించారు. ఒక కాంపోజిషన్లో ఇలా వుంది.

"అలవాట్లు మార్చటానికి వీలులేనంతగా ముదురుబారిపోయిన మీదటనే పిల్లలకు తల్లిదండ్రులతో పరిచయం ఏర్పడుతున్నది. ఇది అత్యంత శోచనీయము."

రామా. ఏమే!......తోడు దొంగలు యిద్దరూ దొరికారు. ఊ! చూస్తారేం...పోయి చదువుకోండి.

[గోపి, లక్ష్మి బిక్క మొఖాలతో గబగబా పోయి చాపమీద కూర్చుని చదువుకొంటూ వుండగా, తెర పడుతుంది.] ★

# * మానవుడు మారణే

(11-వ పేజీ తరువాయి)

లయం కాకం వేస్తుంది. తోవల వీరు వాల్లో గాంధీగారు రాసిన పుస్తకాలు అనేకం వున్నాయి. దేశానికి ఆయన తన అహింసా సిద్ధాంతంద్వారా - ఒక నెత్తురు చుక్క పడనీయకుండా స్వరాజ్యాన్ని ప్రసాదించకేకాదు! తన సిద్ధాంతాలన్నిటినీ ఆయన వాటిలో వివరించాడు. షెల్ఫుల మీద అనేక పత్రికలు పడివున్నాయి. ప్రపంచంలో శాంతి సౌఖ్యాలు ఏర్పడాలని ఉద్ఘోషిస్తూ సంపాదకీయాలు రాయబడి వున్నాయి ఈ విషయా లన్నిటినీ రోజూ అక్కడికివచ్చి - అందరూ చదివి వెళ్తారు. లేదా చదివించుకుంటారు. కాని వాటిని ఆచరణలోకిమాత్రం ఎవరూ తీసుకరారు కాగితాలమీద రాయబడివున్న విషయాలు కాగితాలమీదనే వుంటాయి.

ఆలోచనల భారంతో క్రుంగిపోతున్న మధుకు ఏమీ పాలుపోవటంలేదు ఇంతలో ఎవరో పరుగెత్తుకుంటూ వస్తున్నారు. ఏదో ప్రమాదం వాటిల్లిందని మధు పసికట్టాడు. పరుగెత్తుకొచ్చినవాళ్ళు చెప్పారు—

"నారాయణమూర్తి హత్యవల్ల ప్రతీకార్యాయంగా గూండాంవేపున మరో హత్య జరిగింది. తలకు తలా, చేతులకు చేతులూ - అన్నీ విడివిడిగా పరికి పడివున్నాయి" మధు ఈ మాటలు గొప్పోకుంటూ పరుగెత్తుకుంటూ వెళ్ళేవాళ్ళ వెంటబడి వెళ్ళాడు!

అతని తల తిరిగిపోతోంది పంజాబ్లో బెంగాల్లో హిందువులు, ముస్లిములూ కొట్టుక చచ్చారు! బయట. విభిన్న దేశాల మధ్య ఆటంబాంబులతో యుద్ధాలు జరుగుతున్నాయి. ఇక్కడ. ఒక వూళ్లోవుంటూ ఒకరకంగా జీవిస్తూ - ఒకజాతికి సంబంధించిన మనుషులు మతస్పర్థలతో ఒకరినొకరు చంపుకుంటున్నారు వందలు, వేలు సంవత్సరాలనుంచి ఈ దేశంలో ఎవరో కొందరు స్థాపించిన శాంతిసౌఖ్యాల స్వర్గధామాల్ని నరకతుల్యం చేస్తున్నారు. నవజీవనం పొంగి

పోవలసిన ఈ ప్రదేశాల్లో మృత్యువు తాండవనృత్యం చేస్తున్నది ఏదో ఒక పాశవికశక్తి ఇక్కడ మనుషుల్లో ప్రవేశించి విచక్షణాజ్ఞానాన్ని అంతరింపజేసింది ఒకవేపునుంచి-అశ్రుధారలు! మరోవేపున రక్తప్రవాహాలు!! ఇదే ఇక్కడి ప్రస్తుతస్థితి!

గ్రంథాలయం ముందు కూచొని - తనకు ఎదురుగా నిర్జనంగా కన్పించే పెద్ద బజారును చూచి మధుకు దుఃఖం ఆగింది కాదు. రోజూ ఆ బజారు ఎంతో సందడిగా వుండేది ఇప్పుడది మృతప్రాయంగా పడివుంది - ఈ చివరనుంచి ఆ చివరవరకు! రాతియుగంలో బహుశా ఇదంతా ఒక అడవిగా వుండివుంటుంది! ఇక్కడ వాసం చేసిన మనుషులు పశుప్రాయులైవుంటారు! కాలక్రమేణ నాగరికత అభివృద్ధి చెందింది— పరస్పర భాతృత్వంతో నిండిన నవజీవనం నిర్పడిన రోజున మానవుడు - తనచుట్టూ అందాన్ని వెదజల్లి-ఎగుడు దిగుడు లేని ఈ బాటల్ని సృష్టించాడు! శాంతి సౌఖ్యాలు పొంగిపొరలిపోయాయి దీనికొరకు మానవుడు సతత యత్నం చేశాడు! కొన్ని వందల సంవత్సరాలు దీనికోసం తపస్సు చేశాడు ఆ తపస్సు ఫలించింది కాని ఇంతా అయ్యాక మరల మానవుడు పశుప్రాయుడయ్యాడు వెనక చేసినతపస్సంతా వ్యర్థమైంది ఇప్పుడు మరల వెనకటిలాగా అడవిమనుష్యులకుమల్లే ప్రవర్తిస్తున్నాడు శాంతి నశించిపోయింది ఇక్కడ రాక్షసత్వం రాజ్యమేలుతోంది ఇక్కడ నివసించేది - మానవులు కాదు మానవాకారంలో నిజంతువులు! అడవిజంతువులు!! అవి తనతోపాటు నివసించే జంతువుల్ని చంపి వాటి రక్తాన్ని తాగుతాయి!"

* * *

సాయంత్రం ఐదున్నరయింది కొద్దికొద్దిగా జనసంచారం కన్పిస్తోంది! వాళ్ళందర్నీ గ్రంథాలయం ముందు మూడు బజార్లూ కలిసిన విశాలఖాళీ స్థలంలో ఏకం చేసి 'మీరు ఒకర్ని చూచి మరొకరు ద్వేషించుకోకండి విశాల దృక్పథంతో-మీరాబోయే తరంవారికి ఒక నూతన జగత్తును సృష్టించండి'- అని చెబుదామనుకున్నాడు! అతనికి అర్థంకాలేదు - జనం గ్రంథాలయానికి ఉత్తరపు వేపునా దక్షిణపు వేపునా గుమిగూడుతున్నారు! అందరి చేతుల్లోనూ బాణాకర్రలున్నాయి కొందరిచేతుల్లో కత్తులు తళతళలాడుతున్నాయి రోజూ సాయంత్ర సమయాల్లో వేదాంత రహస్యాల్ని గూర్చి చర్చించుకునే చోటూ, లంకపొగాకు ప్రాశస్త్యాన్ని గూర్చి తర్జనభర్జనలు చేసుకునే ప్రదేశంలో- ఈవూరి పెద్దమనుషుల కొడుకులు - కత్తులకు పదును పెట్టుకుంటున్నారు చెరువులో పచ్చటి ఆకుల మధ్య వికసించిన ఎర్రటి తామరపూలు - చాలా అందంగా కన్పిస్తున్నాయి వాటిచెంత తెల్లటి కొంగలు-దొంగజపం జేస్తున్నాయి! గ్రంథాలయం ముందు - ఉభయపార్టీలవాళ్ళూ గిరిగీసుకొని ఎదురుబొదురుగా నిల్చొని కొట్లాడుకోటానికి సిద్ధపడుతున్నారని - మధుకు అర్థమైంది ఉదయంనుంచి సాయంత్రందాకా కలిసి వున్నట్లేవుండి - మనసుల్లో వైషమ్యాల్ని ప్రకోపింపజేసుకొని-తమ కొడుకులతో గ్రామకక్షల్ని సాధించుకోమని ఉసిగొలిపే-పెద్దమనుషులమీద మధుకు అంతులేనికోపం - ఉవ్వెత్తున లేచింది

ఈగ్రామంలోవున్న శాంతిని-ధ్వంసం చేసి రాక్షసత్వాన్ని స్థాపించటానికి చూస్తున్నారు వీళ్ళంతా! ఒకరి శవాలమీదనుంచి మరొకరు నడిచిపోవాలని పోటీపడుతున్నారు మానవత్వాన్నే సమూలంగా నాశనం చేసేందుకు ఆయత్తపడుతున్నారు

మధు ఇలా ఎప్పటికీ జరగనీయడు! తన సంస్కారాలను వృధాగా పోనీయడు! రాబోయే తరంవాళ్ళకు - ఇలా పరస్పరంగా చంపుకోటం అవివేకం'అని చెబుతాడు!

మధుచూస్తుండగానే కొట్లాట ప్రారంభమయింది తలలు పగుల్తున్నాయి చేతులు వూడిపోతున్నాయి నేలంతా రక్తంతో తడిసిపోతున్నది మధు చూడలేకపోయాడు తనకు బంధువులే అయినటువంటి ఒకతనిదగ్గరకువెళ్ళి చేతిలోవున్న కత్తి-కర్ర లాక్కోపోతుండగా మరోవేపునుంచి మధు తలమీద బలమైన దెబ్బ తగిలింది దాంతో అతను క్రింద పడిపోయాడు! లేవబోయి మరల క్రింద పడిపోయాడు! మంచినీళ్ళని నోరు చూయించాడు కాని అతనివేపు చూచేవాళ్ళే లేరు! అంతా తమ ప్రతాపాల్ని ప్రదర్శించుకునే తూకంలో వున్నారు

పోలీసులకారు రావటంతో హటాత్తుగా ఈ అలజడి ఆగిపోయింది ఎటువాళ్ళు అటు పారిపోయారు అక్కడ మిగిలింది - మధు ఒక్కడే! అతను మృత్యువుతో పోరాడుతున్నాడు!

మున్సబు సీతారామయ్య మధును గుర్తుపట్టి ఫలానా అని పోలీసులకు చెప్పాడు! పోలీసులు అతన్ని ఇంటికి చేరుస్తున్నారు దారిలో మధు - ఎదురుగా తూర్పుదిక్కున కన్పించే మంట లేమిటని అడిగాడు అవి గడ్డివాములు, ధాన్యంకుప్పలూను! ఇక్కడ మానవుడు మరణిస్తున్నాడు - అక్కడ మానవత్వం నశిస్తోంది!

మధును ఇంటికి తీసుకెళ్ళేప్పటికి— అతని తల్లి గావురుమని ఏడ్చింది తండ్రి దీనవదనంతో కొడుకువేపు చూస్తున్నాడు! మధు అన్న - తన పరాక్రమాన్ని ప్రదర్శించుకోటానికి వెళ్ళి ఇంకా తిరిగిరాలేదు

వాళ్ళమామ - మధును సంక్రాంతి పండుగకోసం వాళ్ళవూరు తీసుకెళ్ళేందుకు కొడుకును పంపించాడు, ఆ సాయంత్రమే! అక్కడ కమల ఎదురు చూస్తున్నది పందొమ్మిదో తేదీకల్లా మధు మరల మద్రాసు వెళ్ళి తన ఉద్యోగంలో చేరాలి! కాని మధు ఎక్కడికీ వెళ్ళలేడేమో?

చెరువులో వికసించిన తామరపూల మీదుగా - సూర్యుడు పశ్చిమాన ఎర్రటి రక్తం పూసుకున్నాడు! ఇక్కడ మానవుడు మరణిస్తున్నాడు ఊరిబయట మానవత్వం నశిస్తోంది ★



Edited, Printed & Published by S Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu ChettySt, Madras



ఎనూ్మరువద్ద ఉప్పుటేరు

ఫోటో శ్రీ పి సి ఎమ్ ఈశ్వరబాబు-మద్రాసు